త్తొ। సమభూమియాటవలనమికిలిదీనియందుండుదురు ॥౨॥ సనోతిసుఖం దదాతీతి సానుః॥

**ఉత్సః ప్రస్రవణం వారిప్రవాహో నిర్ఝరో ఝరః॥ దరీ తు కందరో వా స్త్రీ**

ఉ-పు॥ షణు దానే। సుఖమునిచ్చునది॥ ౩ ** ఉత్స-ప్రస్రవణశబ్దములు కొండయూట పేళ్లు॥ ఉనత్తిం భ సా ఉత్సః * ఉందీ క్లేదనే। జలము చేత తడిని బొందునది ॥౧॥ ప్రస్రవంత్యాపోస్మాదితి ప్రస్రవణం॥- స్రుగతౌ। దీని యందు ఉదకము జారును ॥౨॥ ** నిర్ఝరఝరశబ్దములు కొండయందు బుట్టిన జలప్రవాహము పేళ్లు। నిర్ఝీర్యతే కాలేన స్వల్పో భవతీతి నిర్ఝరః ఝరశ్చ ఝృష్ వయోహానౌ। కాలక్రమము చేత స్వల్పమై పోవునది ॥ పా। ఝరీ ॥౧॥౨॥ ** దరీ కందర శబ్దములు జనుల చేతఁ జేయఁబడినది గాని స్వభావసిద్ధమైనది గాని జలయుక్తమైనది గాని నిర్జలమైనది గాని-అయిన పర్వతము యొక్క-బిలము పేళ్లు। దీర్యతే దరీ। ఈ-స్త్రీ॥ దౄ విదారణే। భేదింపబడునది ॥౧॥ కేన జలేన దీర్యత ఇతి కందరః పు॥ దౄ విదారణే। జలము చేత ప్రక్షాళింపఁబడునది ॥౧॥

**దేవఖాతబిలే గుహా। గహ్వరం**

* దేవఖాతశబ్దము మొదలుగ పర్వతమునందుండెడు గుహల పేళ్లని కొందఱు। గుహాగహ్వరశబ్దములు ౨ దేవతల చేత త్రొవ్వఁబడిన బిలము పేళ్లని కొందఱు। దైవైః ఖాతం దేవఖాతం। దేవతల చేత త్రొవ్వబడినది ॥౧॥ బిల్యత ఇతి బిలం * బిల భేదనే। భేదింపఁబడునది ॥౨॥ దేవఖాతం చ తద్బిలం చ దేవఖాతబిలం। తస్మిన్ గుహాగహ్వరశబ్దౌ వర్తేతే- అని ఒవపక్షమందు ॥ గుహత్యంధకారమితి గుహా-గుహూ సంవరణే। అంధకారము నాక్రమించియుండునది ॥౩॥ గతిం హ్వారయతీతి గహ్వరం * హ్వృ కౌటిల్యే। గమనమును కుటిలముగాఁ జేయునది ॥౪॥

**గండశైలాస్తు చ్యుతాః స్థూలోపలా గిరేః॥౪౪॥**

** భూకంపాదినా గిరేశ్చ్యుతాః స్థూలోపలాః గండశైలా ఇత్యుచ్యంతే॥ భూకంపాదుల చేత పర్వతమునుంచి జారిన దొడ్డ రాళ్లు గండశైలములనంబడును। గండా ఇవ శైలాః గండశైలాః। కపోలముల వలె వెడల్పులైనవియునైన శైలములు * గండాః స్థూలాః శైలా వా గండశైలాః। స్థూలములైన శైలము

**ఖనిః స్త్రియామాకరస్స్యాత్**

** ఖన్యాకరశబ్దము- జేగురు-లోహము-రత్నములు మొదలైనవి పుట్టునట్టి గని పేళ్లు। ఖన్యతే రత్నాదికమత్రేతి ఖనిః॥ ఇ-స్త్రీ। ఖను అవదారణే। రత్నములు దీనియందు త్రొవ్వఁబడును ॥ పా। ఖానిః। ఆకరః ఖనిః స్త్రీ ఖానిరితి వ్యాడిః ॥౧॥ ఆకీర్యంతే లోహాదయోఽత్ర ఆకరః- కౄ విక్షేపే। లోహములు దీనియందు చల్లఁబడును ॥౨॥

**పాదాః ప్రత్యంతపర్వతాః॥**

** పాదప్రత్యంతపర్వతశబ్దములు కొండ సమీపమునందు చుట్టు వారనుండెడు చిన్నతిప్పల పేళ్లు॥ అద్రేః పాదా ఇవ అధస్స్థితత్వాద్ధారణా పాదాః। పర్వతముల కు పాదముల వలె క్రిందనుండునది ॥ పర్యంత ఇతి పాదాః - పద గతౌ। పొందబడునది ॥౧॥ ప్రత్యంతే సమీపపర్వతాః। సమీపమునందుండునవి ॥౨॥

**ఉపత్యకాద్రేరాసన్నా భూమిరూర్ధ్వమధిత్యకా॥౪౫॥**

** పర్వతముకిందటి సమీపభూమి పేరు ఉపత్యక యనంబడును। పర్వతము మీఁదటి భూమి అధిత్యక యనంబడును- ఉపసమీపే భూమిరుపత్యకా। పర్వతము యొక్క సమీపభూమి ॥౧॥ ఊర్ధ్వప్రదేశస్థా భూమిరధిత్యకా। పర్వతము మీఁదనుండెడు భూమి ॥౧॥

**ధాతుర్మనశ్శిలాద్యద్రేర్గైరికంతు విశేషతః।**

** మనశ్శిలా హరితాళాదిరశ్మవికారో ధాతురిత్యుచ్యతే। మనశ్శిల- హరిదళము-గంధకము మొదలైన శిలావికారములన్నియు సామాన్యముగా ధాతువులనంబడును। విశేష ధాతుర్గైరికమిత్యుచ్యతే, విశేషధాతువు గైరికమనంబడును। ధత్తే మిథో వ్యావర్తకంధర్మం ధాతుః॥ ఉ-పు॥ డుధాఞ్ ధారణపోషణయోః। పరస్పరము భేదమైన ధర్మమును ధరించునది ॥౧॥ గిరౌ భవం గైరికం। పర్వతమునందుఁ బుట్టినది ॥౨॥ ఆదిశబ్దేన సువర్ణాదయో గృహ్యంతే॥ శ్లో॥ సువర్ణరౌప్యతామ్రాశ్మహరితాళంమనశ్శిలా। గైరికాంజనకాంస్యాదిలోహసీసాస్సహింగుళాః॥ గంధకోఽభ్రకమిత్యాద్యా ధాతవో గిరిసంభవాః ఇతి

**నికుంజకుంజౌ వాక్లీబే లతాదిపిహితోదరే॥౪౬॥**

** నికుంజకుంజశబ్దములు తీఁగెల చేత గృహము వలె నేకప్పఁబడిన పొద పేళ్లు॥ పక్షిణోఽత్ర కూజంతీతి నికుంజః। కుంజశ్చ * కూజ అవ్యక్తశబ్దే। పక్షులు దీనియందు శబ్దించును॥ నియనెడు ఉపసర్గము తక్క-న ఉపసర్గలతోడి యోగము లేదని తెలియఁ జేయుటకొఱకు - ఈ శబ్దములు వికల్పమున నపుంసకలింగములు



ఇతి శైలవర్గః

**అటవ్యరణ్యం విపినం గహనం కాననం వనం**

అటవీ శబ్దము మొదలుకొని అడవి పేళ్లు॥ కానన వన శబ్దములు బహుళమైన వృక్షముల తావులు గల ప్రదేశమాత్రమున కెల్ల పేళ్లని కొందరు। అటంత్యస్యాం మృగయార్థమిత్యటవీ॥ ఈ-స్త్రీ॥ దీనియందు వేటకొ

అటవ్య-చరింతురు॥ అటంతీత్యటాః పశ్వాదయః వయః పక్షిణః-తైరాక్రాంతా-అటవీ॥ అట పట గతౌ। సంచరించువవిగనుక అటములనఁగా పశ్వాదులు-వియనఁగా పక్షులు-అవిదీనియందుఁగలవు॥౧॥ఇయతి॥ ఋ గతౌ। మృగాదులు దీనియందుఁదిరుగును॥౨॥ వేపంతే భయాదత్రేతి విపినం॥ టువేపృ కంపనే। భయము చేతదీనియందువణఁకుదురు॥౩॥గాహ్యత ఇతి గహనం॥ గాహూ విలోడనే। దుష్టమృగముల చేతకలఁచఁబడునది॥ ౪॥కం జలమనం ప్రాణనమస్య కాననం॥ అన ప్రాణనే। జలమే ప్రాణముగాఁగలది॥ కన్యతే గమ్యత ఇతి వా కాననం॥ కన దీప్తికాంతిగతిషు। పొందఁబడునది॥ ౫॥ వన్యతే సేవ్యత ఇతి వనం॥ వన షణ సంభక్తౌ। జనుల చేతనాశ్రయింపఁబడునది॥ ౬॥

మహారణ్యమరణ్యానీ
గృహారామాస్తు నిష్కుటాః॥ ౪౬॥

మహారణ్యారణ్యానీశబ్దములు దొడ్డఅడవి పేళ్లు॥ మహదరణ్యం మహారణ్యం-అరణ్యానీచ॥ ఈ-సీ॥ మహత్తైన అరణ్యము॥ ౧-౨॥ గృహారామ నిష్కుటశబ్దములు ఇంటి చేరువ తోఁటల పేళ్లు॥ గృహే ఆరామః గృహారామః। గృహమందలి తోఁట॥౧॥కూటాత్ గృహాత్ నిర్గతః నిష్కుటః। కూటమనఁగా గృహము-అంతకంటె వెలుపలనుండునది॥౨॥

ఆరామస్స్యాదుపవనం కృత్రిమం వనమేవ యత్॥ అమాత్యగణికాగేహోపవనే వృక్షవాటికా॥ పుమానాక్రీడ ఉద్యానం రాజ్ఞస్సాధారణం వనం। స్యాదేతదేవ ప్రమదావనమంతఃపురోచితమ్॥ ౪౮॥

ఆరామ ఉపవనశబ్దములు మనుష్యులు పెట్టినవనము పేళ్లు॥ ఆరమంతే అస్మిన్నిత్యారామః॥ రము క్రీడాయాం। దీనియందు క్రీడింతురు॥౧॥ఉపసమీపే వనం। సమీపమందలివనము॥ ౨॥ ప్రధానులు-వేశ్యలు వీరలయొక్క-యిండ్లలోపలి తోఁట-వృక్షవాటిక యనంబడును వటతీతి వాటికా వృక్షాణాం వాటికా వృక్షవాటికా॥ వట వేష్టనే। పరివేష్టించియుండునది గనుక వాటిక అనఁగా పఙ్క్తి-వృక్షములయొక్క పఙ్క్తి॥౧॥ ఆక్రీడోద్యానశబ్దములు సకలజనులకును భోగార్హమైన రాజుయొక్క యుపవనము పేళ్లు॥ ఆక్రీడంతి జనాః అస్మిన్నితి ఆక్రీడః॥ క్రీడృ విహారే। దినియందు సర్వజనులును క్రీడింతురు॥౧॥ ఉద్యాంత్యస్మిన్నిత్యుద్యానం॥ యా ప్రాపణే। జనులు దీనియందుఁబొందుదురు॥ ౨॥ ఈ రాజుయొక్క వనమే సాధారణముగాక అంతఃపురమునకును చితమైనదై ప్రమదావనమనంబడును॥ ప్రమదానాం వనం ప్రమదావనం। స్త్రీలయొక్క వనము॥ పా॥ ప్రమదవనం॥ శ్లో॥ ప్రమదవనోపకంఠసన్నివేశేషు లతాభవనేషు భూయః॥ చారకర్మణి నిష్ణాతః ప్రవిష్టః ప్రమదావనమిత్యుభయత్రోదాహరణం॥ ౧॥

వీథ్యాళిరావళిః పఙ్క్తిః శ్రేణీ

వీథీశబ్దము మొదలు ౫ వృక్షపఙ్క్తి పేళ్లు॥ పఙ్క్తి మాత్రమునకును పేళ్లు॥ వియంతి గచ్ఛంత్యనయా వీథీ॥ ఈ-సీ॥ వీ గతిప్రజనకాంత్యసనఖాదనేషు। దీనిచేత నడుతురు॥౧॥ అలతి భూషయతీత్యాళిః॥ అల భూషణపర్యాప్తివారణేషు। అలంకరించునది॥౨॥ ఆవలతే సంవృణోతీత్యావళిః॥ వల సంవరణే। చుట్టువారియుండునది॥ ౩॥ పచ్యతే వ్యక్తీక్రియతేనయేతి పఙ్క్తిః॥ పచి వ్యక్తీకరణే। దీనిచేత వృక్షములు వ్యక్తముగాఁజేయఁబడును॥౪॥ శ్రియతే సేవ్యత ఇతి శ్రేణీ॥ శ్రిఞ్ సేవాయాం। ఒప్పిదము చే నాశ్రయింపఁబడునది॥౫॥

లేఖాస్తు రాజయః।

లేఖా రాజీ శబ్దములు-ఎడతెగక దట్టమైయుండెడు పఙ్క్తి పేళ్లు॥ లిఖ్యంత ఇతి లేఖాః॥ లిఖ అక్షరవిన్యాసే। అక్షరపఙ్క్తివలె లిఖింపఁబడునది॥ ౧॥ రాజంతే రాజయః॥ ఇ-సీ॥ రాజృ దీప్తౌ ॥ ప్రకాశించునది॥ ౨॥

వన్యా వనసమూహే స్యాత్॥ అంకురోభినవోద్భిది॥ ౫౦॥

వన్యాశబ్దము వనసమూహము పేరు॥ వనానాం సమూహో వన్యా। వనములయొక్క సమూహము॥ ౧॥ అంకుర అభినవోద్భిచ్ఛబ్దములు క్రొత్తగా మొలిచిన మొలక పేళ్లు॥ అంక్యతే లక్ష్యత ఇత్యంకురః॥ అకి లక్షణే। కానఁబడునది॥ పా॥ అ॥ంకూరః॥ శ్లో॥ అంకూరశ్చాంకురః ప్రోక్త ఇతి హలాయుధః। తథాచాశ్వచరితే వసంతరాజః॥ శ్లో॥ అంకూరితే పల్లవితే సపుష్పే ఫలాన్వితే భూరుహిసారమేయ ఇతి॥ ౧॥ ఉద్భినత్తి భువం బీజం చ ఉద్భిత్॥ ద-పు॥ భూమిని-బీజమును భేదించునది॥ ౨॥

వృక్షో మహీరుహశ్శాఖీ విటపీ పాదపస్తరుః। అనోకహః కుటస్సాలః పలాశీ ద్రుద్రుమాగమాః॥ ౫౧॥

వృక్షశబ్దము మొదలుగ౧౭వృక్షము పేళ్లు॥ వృశ్చ్యతే ఛిద్యత ఇతి వృక్షః॥ ఓవ్రశ్చూ ఛేదనే । ఛేదింపఁబడునది॥౧॥ మహ్యాం రోహతీతి మహీరుహః॥ రుహ బీజజన్మని ప్రాదుర్భావే। భూమియందు మొలుచునది ॥౨॥ శాఖాః అస్య సంతీతి శాఖీ॥ న-పు॥ కొమ్మలుగలది॥ ౩॥ విటపాః- అస్య సంతీతి విటపీ॥ న-పు॥ కొమ్మలుగలది॥ ౪॥ పాదైర్మూలైః జలం పిబతీతి పాదపః॥ పా పానే । పాదములనఁగా వేళ్లు॥ వానిచేత జలమును పానముఁజేయునది॥ ౫॥ తరంత్యాతపమనేనేతి తరుః॥ ఉ-పు॥ తౄ ప్లవనతరణయోః॥ ఎండను దీనిచేత తరింతురు ॥౬॥ అనసః శకటస్య అకం గమనం హంతీతి అనోకహః॥ హన హింసాగ

త్యోః। అనస్సనఁగాఁబండి- అకమనఁగాఁగమనము-బండియొక్క గమనమును చెఱుచునది॥౭॥ కుటతి శాఖాదినావక్రీభవతీతి కుటః*కుట కౌటిల్యే। శాఖాదులచేత వక్రమైయుండునది॥౮॥ సల్యతె గమ్యతె జనైరితి సాలః*సలగతౌ। జనులచేత పొందఁబడునది॥౯॥ పలాశాని పర్ణాని అస్య సంతీతి పలాశీ॥ న- పు॥ పలాశములనఁగా ఆకులు- అవి గలది॥౧౦॥ ద్రూయతె ద్రుః॥ ఉ- పు॥ ద్రుగతౌ। పొందఁబడునది॥౧౧॥ ద్రుః వృక్షావయవో స్యద్రుమ అనఁగా శాఖ- అది గలిగినది॥౧౨॥ నగచ్ఛతీత్యగమః*గమ్ల్ గతౌ। ఒకచోటికి నిబోనిది॥౧౩॥

**వానస్పత్యః ఫలైః పుష్పాత్తైరపుష్పాద్వనస్పతిః। ఓషధ్యః ఫలపాకాంతాః**

*పుష్పమువలనఁబుట్టిన ఫలములతోఁగూడిన- మామిడి మొదలైనది వానస్పత్యమనంబడును॥ పుష్పములు లేక ఫలములతోఁగూడిన పనస మేడి మొదలైనది వనస్పతియనంబడును॥ వనస్యపతిః వనస్పతిః- వానస్పత్యః। వనమునకు పతిగనుక వనస్పతి- వానస్పత్యంబును॥ *ఫలించగానే చెడిపోయ్యెడి అరటి- వరి మొదలైనవి యోషధులనంబడును॥ ఓషం దాహం ధయంతీత్యోషధ్యః॥ ఈ- స్త్రీ॥ ధేట్ పానే। దాహమును బోఁగొట్టునది*ఓషో దాహస్తత్ర ధీయతె ఇత్యోషధ్యః* ఉపదాహే* డుధాఞ్ ధారణపోషణయోః। దీనియందు దాహము ధరింపఁబడును॥౧॥ ఫలపాకఏవ అంతో యాసాం తాః ఫలపాకాంతాః। ఫలపరిపక్వమే అంతముగాఁగలవి॥ ౨

**స్యాదవంధ్యః ఫలేగ్రహిః॥ ౬॥ వంధ్యోఽఫలోఽవకేశీ చ**

*అవంధ్య ఫలేగ్రహి శబ్దములు గొడ్డుగాక ఫలించెడు మ్రాకు పేళ్లు॥ న వంధ్యః అవంధ్యః। గొడ్డుగానిది అవంధ్యము॥ ౧॥ ఫలాని గృహ్ణాతి ధరతీతి ఫలేగ్రహిః॥ ఇ॥ ఫలమును గ్రహించునది॥ ౨॥ *వంధ్యాదిశబ్దములు ౩ గొడ్డుమ్రాకు పేళ్లు॥ స్వగతవైగుణ్యేన ఫలాని బధ్నాతీతి వంధ్యః*బధ బంధనే। తనయందలిదైగుణ్యము చేత ఫలమునడ్డపెట్టునది పబయోరభేదః॥౧॥ న సంతి ఫలాన్యస్య అఫలః। ఫలములు లేనిది॥ ౨॥ అవకం ఫలం స్యం ఈష్టె పాలయతీత్యవకేశీ॥ న్। ఈశ ఐశ్వర్యే। అవకమనఁగా ఫలము- దాని పాలించునది॥ ౩॥

**ఫలవాన్ ఫలినః ఫలీ**

*ఫలవచ్ఛబ్దము మొదలు ౩ తత్కాలమందు పండియుండెడు మ్రాకు పేళ్లు॥ ఫలాని సంత్యస్య ఫలవాన్॥ త॥ ఫలినః॥ అ॥ ఫలీచ॥ న॥ ఫలములు గలిగినది- ఫలవంతము- ఫలినము- ఫలి॥ ౩॥

**ప్రఫుల్లోత్ఫుల్లసంఫుల్లవ్యాకోచవికచస్ఫుటాః॥ ౭॥ ఫుల్లశ్చైతే వికసితే**

*ప్రఫుల్లశబ్దము మొదలు ౮ వికసించినదాని పేళ్లు॥ ప్రఫుల్లతి ఉత్ఫుల్లతి సంఫుల్లతీతి ప్రఫుల్లః ఉత్ఫుల్లః సంఫుల్లశ్చ*ఫుల్ల వికసనే। వికసించునది ప్రఫుల్లము- ఉత్ఫుల్లము సంఫుల్లము॥ ౧॥ ౨॥ ౩॥ వ్యావృత్తః కోశో స్య వ్యాకోశః*కుశ శ్లేషణే। కోశమనఁగా కూటమి- అది దీనియందు లేదు॥ పా॥ వ్యాకోచః॥ ౪॥ విగతః కచో బంధనమస్య వికచః*కచ బంధనే। విగతమైన బంధము గలిగినది॥౫॥ స్ఫుటతి వికసతీతి స్ఫుటః* స్ఫుటిర్ విశరణే। వికసించునది॥ ౬॥ ఫుల్లతీతి ఫుల్లః*ఫుల్ల వికసనే। వికసించునది॥ ౭॥ వికసతి విస్తారం ప్రాప్నోతీతి వికసితః- కస గతౌ। విస్తారమును బొందునది॥ ౮॥ తథా పుష్పితము న్నిద్రం హసితోన్మీలితాని చ। స్యాదుద్బుద్ధం చోచ్ఛ్వసితం తద్వైవచ విజృంభితం॥

**స్యురవంధ్యాదయస్త్రిషు॥ స్థాణుర్వా నా ధ్రువశ్శంకు**

*అవంధ్యశబ్దము మొదలు వికసితశబ్దము వరకుఁగలశబ్దములు త్రిలింగములు*స్థాణ్వాదిశబ్దములు ౩ మోటు పేళ్లు॥ వాయునాపి హతో పి తిష్ఠతీతి స్థాణుః॥ ఉ- పు॥ ష్ఠా గతినివృత్తౌ। వాయువు చేత కొట్టఁబడియు నిలియుండునది॥౧॥ చలనాభావాత్ ధ్రువతీతి ధ్రువః ధ్రువ స్థైర్యే। చలనము లేకుండుటవలన స్థిరమైయుండునది॥ ౨॥ శంక్యతే అస్మాత్పురుషధియా శంకుః ఉ- పు॥ శకి శంకాయాం। పురుషబుద్ధి చేత దీనియందు శంకింతురు॥ ౩॥

**హ్రస్వశాఖాశిఫః క్షుపః॥ ౮॥**

*హ్రస్వాః శాఖాః శిఫాశ్చ యస్య సః క్షుప ఇత్యుచ్యతె- హ్రస్వములైన కొమ్మలును- ఊడలును గలిగియుండెడు గుజ్జుమ్రాకు- క్షుపమనంబడును॥ దావాగ్నినా దహ్యమానః క్షౌతీతి క్షుపః- టుక్షు శబ్దె। దావాగ్ని చేత దహింపఁబడిన శైథ్వనియుక్తమైయుండునది॥ ౧॥

**అప్రకాండే స్తంబగుల్మౌ**

స్తంబగుల్మశబ్దములు ప్రకాండము లేక - ఆకులు తీయుచుగాఁగల పొద పేళ్లు॥ చెట్టుయొక్క వేళ్లకును కొమ్మలకును నడుమనుండెడు భాగము ప్రకాండమనఁబడును॥ తిష్ఠతీతి స్తంభః*ష్ఠా గతినివృత్తౌ। స్థిరమైయుండునది॥౧॥ గుడతి చోరాదిభిర్భీతాన్ గుల్మః*గుడ రక్షాయాం। చోరాదులచేత భయపడువారి నిరక్షించునది॥ ౨॥

**వల్లీ తు వ్రతతిర్లతా।**

*వల్లీశబ్దము మొదలు ౩ తీఁగె పేళ్లు॥ వలతె వేష్టతే యష్ట్యాదికమితి వల్లీ। ఈ- స్త్రీ॥ *వల వేల్ల సంవరణె। కఱ్ఱ మొదలైన వాటిని చుట్టుకొనియుండునది॥ ౧॥ ప్రకృష్టా తతిర్విస్తారో స్యాః ప్రతతిః- ఇ- స్త్రీ॥ *తను విస్తారే। మిక్కిలి విస్తారము దీనికిఁగలదు పా॥ వ్రతతిః ఈ- స్త్రీ॥ తథాచ॥ శ్లో॥ పరిష్ఠస్సానుసిమా నే

చ ప్రతతి స్తతి వీరుధోరితి పకారాదాప జయః ॥ ధరాధరేంద్రం వ్రతతీతతీరి వేతిమాఘః ॥ ౨ ॥ లాతి వేష్టనార్థం యష్ట్యాదికమితి లతా ॥ లాదానే । పాకుటకొఱకుగడలు మొదలైనవాటిని పుచ్చుకొనునది ॥ ౩ ॥

లతా ప్రతానినీ వీరు
ద్గుల్మిన్యులప ఇత్యపి ॥
౪౭ ॥

*వీరుచ్ఛబ్దము మొదలు ౩ దట్టముగా నల్లిన లతాసమూహముగల పొదపేళ్లని కొందఱు. ఈపక్షమందు లతా ప్రతాననీ అని ఏకపదము. ప్రతానము అనఁగా కొమ్మలయందుండెడు ఆకులయొక్క సమూహము. దానితోఁ గూడిన ద్రాక్షాతాంబూలవల్ల్యాదులు. వీరుత్ మొదలైన ౩ శబ్దములచేఁ జెప్పఁబడునని కొందఱు. అప్పుడు లతా-ప్రతాననీ అని భిన్నపదములు । విరుణద్ధీతి వీరుత్ । ధ-సీ ॥ *రుధిర్ ఆవరణే । విశేషముగాఁ జుట్టుకొనియుండునది* వివిధం రోహతీతి వా వీరుత్ *రుహ బీజజన్మని ప్రాదుర్భావే । నానావిధములుగా మొలుచునది ॥ ౧ ॥ గుల్మో లతాసమూహోఽస్యా అస్తీతి గుల్మినీ ॥ ఈ-సీ ॥ గుల్మమనఁగా లతాసమూహము - అది గలిగినది ॥ ౨ ॥ ఉలతే ఆవృణోతీత్యులపః *ఉల సంవరణే । చుట్టుకొనియుండునది ॥ ౩ ॥

నగాద్యారోహ ఉ
చ్ఛ్రాయ ఉత్సేధ
శ్చోచ్ఛ్రయశ్చ సః ।
అస్త్రీ ప్రకాండః స్కం
ధ స్స్యాన్మూలాచ్ఛా
ఖావధే స్తరోః ॥ ౪౮ ॥

*ఉచ్ఛ్రాయశబ్దము మొదలు ౩ పర్వతము - వృక్షము మొదలైనవానియొక్క పొడవు పేళ్లు । ఉత్ శ్రయణముచ్ఛ్రాయః - ఉచ్ఛ్రయశ్చ - ఊర్ధ్వముగాఁ బొందుట ఉచ్ఛ్రాయము - ఉచ్ఛ్రయమును ౧, ౩ ॥ ఉద్గతిరుత్సేధః *షిధు గత్యాం ఊర్ధ్వముగాఁ బోవునది ॥ ౨ ॥ *ప్రకాండస్కంధశబ్దములు కొమ్మ అవధిగాఁ గలిగిన చెట్టుయొక్క మధ్యభాగము పేళ్లు ॥ ప్రకామ్యతే ఫలరక్షణాదిభిరితి ప్రకాండః *కము కాంతౌ । ఫలమును రక్షించుట మొదలైనవాటిచేత మిక్కిలి కోరఁబడునది ॥ ౧ ॥ స్కంద్యతే అధిరుహ్యత ఇతి స్కంధః *స్కందిర్ గతిశోషణయోః । ఉన్నతముగాఁ బడునది ॥ ౨ ॥ *శాఖాలతాశబ్దములు కొమ్మల పేళ్లు ॥ శాఖతి దిశో వ్యాప్నోతీతి శాఖా *శాఖృ వ్యాప్తౌ । దిక్కులను వ్యాపించునది ॥ ౧ ॥ లాతి వేష్టనార్థం యష్ట్యాదికమితి లతా *లా దానే । పాకేకొఱకుగడలు మొదలైనవాటిని పుచ్చుకొనునది ॥ ౨ ॥ *స్కంధశాఖాశాలాశబ్దములు ప్రాకు మొదటికొమ్మ పేళ్లు ॥ స్కంధా

సమే శాఖాలతే

స్కంధశాఖా శాలే

న్నిర్గతా శాఖా స్కంధశాఖా । స్కంధమనఁగా ప్రాకు మొదలు అందువలన బుట్టినకొమ్మ ॥ ౧ ॥ శాలతే శాలా *శాల శ్లాఘాయాం । శ్రేష్ఠమైనది ॥ ౨ ॥ *శిఫాజటాశబ్దములు వృక్షమూలమున జడవలె నుండునట్టి యూడపేళ్లు ॥ శినోతి వృక్షమూలమితి శిఫా *శిఞ్ నిశాతనే । చెట్టు మొదలును సన్నముగాఁ జేయునది ॥ ౧ ॥ జటతి సమూహీభవతీతి జటా *జట సంఘాతే । సమూహముగా నుండునది ॥ ౨ ॥

శిఫాజటే ।

శాఖాశిఫావరోహ
స్స్యాన్మూలాచ్చా
గ్రం గతా లతా ॥ ౪౯ ॥
శిరోఽగ్రం శిఖరం వా
నా

మూలం బుధ్నోఽం
ఘ్రినామకః ।

* మఱ్ఱిచెట్టు మొదలైనవానికొమ్మలయందుండునట్టి యూడలు చెట్టు మొదటనుండి కొనదనుక పోయినతీఁగెలును - అవరోహమనంబడును ॥ అవరోహతే లంబత ఇత్యవరోహః *రుహ బీజజన్మని ప్రాదుర్భావే । వ్రేలుచుండునది ॥ ౧ ॥ *శిరః ప్రభృతిశబ్దములు ౩ చెట్టుకొన పేళ్లు ॥ శ్రయతి స్వాంగం శిరః ॥ స-న ॥ స్వాంగమునందుండునది ॥ ౧ ॥ అగతీత్యగ్రం *అగ కుటిలాయాం గతౌ । కుటిలముగాఁ బోవునది ॥ ౨ ॥ శిఖాకారతాస్యాస్తీతి శిఖరం ॥ అ-ప్న ॥ శిఖవంటి ఆకారము దీనికిఁ గలదు ॥ ౩ ॥ *మూలాదిశబ్దములు ౩ చెట్టు మొదటి పేళ్లు ॥ మూలయతీతి మూలం *మూల ప్రతిష్ఠాయాం । ప్రతిష్ఠను జేయునది ॥ ౧ ॥ బుధ్యంతే ఆనేనేతి బుధ్నః *బుధ అవగమనే । దీనిచేత వృక్షము తెలియఁబడును ॥ పా ॥ బ్రధ్నః ॥ ౨ ॥ అంఘ్రేర్నామ పాదపర్యాయో యస్యాసోంఽఘ్రినామకః । పాదములకు పర్యాయపదములుగలవో - అవియన్నియు దీనికిఁ గలవు ॥ ౩ ॥ *సారమజ్జశబ్దములు చెట్టులోనుండెడు చేవ పేళ్లు ॥ కాలాంతరమపి సరతీతి సారః *సృ గతౌ । కాలాంతరమును బొందియుండునది ॥ ౧ ॥ మజ్జతీతి మజ్జా ॥ న-పు ॥ *టుమస్జో శుద్ధౌ । పరిశుద్ధమైనది *దార్వంతరే మజ్జతీతి మజ్జా । ప్రాకులో మునిగియుండునది ॥ ప ॥ మజ్జా ॥ ఆ-సీ ॥ ౨ ॥ *త్వగాదిశబ్దములు ౩ నార పేళ్లు ॥ త్వచతి-సంవృణోతి వృక్షమితి త్వక్ ॥ చ-సీ ॥ వల్కం ॥ అ-ప్న ॥ వల్కలం చ ॥ ప్న ॥ *త్వచ సంవరణే *వల సంవరణే । వృక్షమును గప్పుకొనియుండునది గనుక త్వక్కు - వల్కము - వల్కలమును ॥ ౧ ॥ ౨ ॥ ౩ ॥ *కాష్ఠదారుశబ్దములు కొయ్యపేళ్లు ॥ కాశతే అగ్నినా సమం కాష్ఠం *కాశృ దీప్తౌ । అగ్నితోఁ గూడి ప్రకాశించునది ॥ ౧ ॥ దృణాతి దారాదీర్యత ఇతి దారు ॥ ఉ-న ॥ *దౄ విదారణే । గొడ్డలి మొదలయిన

సారో మజ్జా నరి

త్వక్ స్త్రీ వల్కం వ
ల్కలమస్త్రియామ్ ॥
౫౦ ॥ కాష్ఠం దార్విం

వాటి చేత వ్రక్కలింపఁబడునది॥ పా॥ తారుః॥ పున్నపుంసకయోర్దారురితి త్రికాండశేషః॥ ౨॥

**ఇంధనం త్వేధ ఇధ్మమేధస్సమిత్ స్త్రియాం॥**

*ఇంధనాది శబ్దములు ౫ సమిధ పేళ్లు॥ ఇంధే అగ్నిరనేన ఇంధనం। ఇధ్మశ్చ *ఞిఇంధీ దీప్తౌ। దీని చేత నగ్ని ప్రకాశించును॥౧॥౩॥ ఏధతే అగ్నిరనేన ఏధః॥ స-న॥ ఏధశ్చ॥అ-పు॥ *ఏధ వృద్ధౌ। దీని చేత అగ్ని వృద్ధిఁబొందును॥ ౨॥౪॥ సమింధే అగ్నిరనయేతి సమిత్॥ ధ-సీ॥ దీని చేత అగ్ని మిక్కిలి ప్రకాశించును॥౫॥

**నిష్కుహః కోటరం వా నా**

*నిష్కుహ కోటర శబ్దములు మ్రానితొఱ్ఱ పేళ్లు॥ నిష్కుహయతే విస్మాపయతీతి నిష్కుహః *ష్టుహ విస్మాపనే। విస్మయమును జేయునది॥౧॥ కుటతీతి కోటరం॥అ-న్న॥ *కుట కౌటిల్యే। కుటిలమై యుండునది॥౨॥

**వల్లరీ మంజరీ స్త్రియౌ॥ ౪౫॥**

*వల్లరీ మంజరీ శబ్దములు పూగుత్తులుఁగాని పూచిన కొమ్మకుఁగాని పేళ్లు॥ వల్లతే శాఖాం సంవృణోతీతి వల్లరీ॥ఈ-సీ॥ *వల వల్ల సంవరణే। కొమ్మను గప్పునది॥౧॥ మన్యతే పికాదిభిర్బహుమన్యతు మంజరీ॥ఈ-సీ॥ *మన అవబోధనే। కోకిలాదుల చేత శ్రేష్ఠముగాఁ దెలియఁబడునది॥ ౨॥ ఈ శబ్దములు ఇకారాంతములుం గలవు।

**పత్రం పలాశం ఛదనం దలం పర్ణం ఛదః పుమాన్।**

*పత్ర శబ్దము మొదలు ౬ ఆకుల పేళ్లు॥ వృక్షాత్పతతీతి పత్రం *పత్ల్ గతౌ। వృక్షమునందుండి పడునది॥౧॥ పలాశ్యతే గ్రస్యతే పలాశం *పలపూర్వః అశ భోజన ఇతి ధాతుః *రలయోరభేదః। వ్రతయుక్తులైన వారి చేత భక్షింపఁబడునది॥ ౨॥ ఛాద్యతే వృక్షః అనేనేతి ఛదనం *ఛద అపవారణే। దీని చేత వృక్షము కప్పఁబడును॥ ౩॥ దలతీతి దలం-దల విశరణే। పగులునది॥౪॥ పిపర్తి వృక్షమితి పర్ణం *పౄ పాలనపూరణయోః। వృక్షమును నిండియుండునది॥౫॥ ఛాద్యతే వృక్షోనేనేతి ఛదః- ఛద అపవారణే। దీని చేత వృక్షము కప్పఁబడును॥౬॥

**పల్లవోస్త్రీ కిసలయం**

*పల్లవ కిసలయ శబ్దములు చిగురు పేళ్లు॥ ఆకులతోఁ గూడిన కొమ్మ పేళ్లని కొందఱు। పలతి వాయువశాచ్చలతీతి పల్లవః॥అ-న్న॥ పల గతౌ। వాయువశమున కదలునది॥౧॥ కించిచ్చలతీతి కిసలయం- వల గతౌ। ఇంచుకంత చలించునది॥౨॥

**విస్తారో విటపోస్త్రీయాం॥ ౪౬॥**

*విస్తార విటప శబ్దములు వృక్షము యొక్క కొమ్మలు చిగుళ్లు మొదలయిన వాటి సమూహము పేళ్లు॥ విస్తీర్యతే తరురనేనేతి విస్తారః- స్తృఞ్ ఆచ్ఛాదనే వృక్షము దీని చేత విస్తారముగాఁ గప్పఁబడును॥౧॥ వటతి ఆచ్ఛాదయతీతి విటపః- వట వేష్టనే। పరివేష్టించియుండునది *విటాన్ పాతీతి విటపః- పాలించునది॥ ౨॥

**వృక్షాదీనాం ఫలం సస్యం**

*వృక్షలతాదుల యొక్క ఫలము సస్యమనంబడును॥ సస్తి వృక్షమధిశేతే సస్యం - షస స్వప్నే। వృక్షమందు శయనించునది॥ ౧॥

**వృంతం ప్రసవబంధనం**

*వృంత ప్రసవబంధన శబ్దములు తొడిమె పేళ్లు॥ వృణీతే పుష్పమితి వృంతం- వృఞ్ సంభక్తౌ। పుష్పమును సంబంధించియుండునది॥ ౧॥ ప్రసవాః పుష్పఫలపత్రాణి సంబధ్యంతే అనేనేతి ప్రసవబంధనం - బంధ బంధనే। ప్రసవమనఁగా పుష్పఫలపత్రములు - అవి దీని చే బంధింపఁబడును॥ ౨॥

**ఆమే ఫలే శలాటుః స్యాచ్ఛుష్కే వానముభే త్రిషు॥ ౪౭॥**

*శలాటు శబ్దము పక్వముగాని కాయ పేరు॥ శలతి పుష్టిమాపద్యతే శలాటుః॥ ఉ-పు॥ *శల గతౌ। పుష్టిని బొందునది॥౧॥ *వాన శబ్దము ఎండిన పండు పేరు॥ వాయతి శుష్యతీతి వానం *ఓవై శోషణే। శుష్కమగునట్టిది॥ శలాటు వాన శబ్దములు మూఁడు లింగములయందును వర్తించును॥ శలాటుః కర్కటీ- శలాటవో మాషాః- శలాటూని ఫలాని- వానా హరీతకీ- వానో ముద్గః

**క్షారకో జాలకం క్లీబే**

*క్షారక జాలక శబ్దములు ౨ పసరు మొగ్గలకును కసిగాయలకును పేళ్లు॥ మొగ్గల గుమికి పేళ్లని కొందఱు॥ క్షరతి ప్రసూతే క్షారకః *క్షర సంచలనే। పుష్పాదులఁ బుట్టించునది॥౧॥ జలతీతి జాలకం *జల ఘాత్యే। తీక్ష్ణమైనది ౨॥

**కలికా కోరకః పుమాన్।**

*కలికా కోరక శబ్దములు - ఇంచుకంత ప్రవృద్ధమైన మొగ్గ పేళ్లు॥ కల్యతే ప్రసూనమితి శబ్ద్యతే కలికా *కల శబ్దసంఖ్యానయోః। పుష్పమగునట్టిదని పలుకఁబడునది॥౧॥ కుర్యతే శబ్ద్యతే కోరకః॥అ-న్న॥ *కుర శబ్దే। పుష్పమగునట్టిదని పలుకఁబడునది॥౨॥

**స్యాద్గుచ్ఛకస్తు స్తబకః**

*గుచ్ఛక స్తబక శబ్దములు- ఒక కొమ్మయందనేక పుష్పములెందుఁ గానఁబడునో- ఆలాటి గన్నేరు మొదలైన పూగుత్తి పేళ్లని కొందఱు। విశాలమైన మొగ్గల సమూహము పేళ్లని కొందఱు॥ దీనికి నుదాహరణము॥ శ్లో॥ ఏకప్రరోహాః పుష్పాణి పృథగ్యత్ర బహూని చ॥ పుష్పగుచ్ఛస్స విజ్ఞేయో యథా స్యాత్కరవీరక ఇతి॥ గుయతే సాధురితి గుచ్ఛకః *గుజ్ శబ్దే। మంచిదని పలుకఁబడునది॥ పా॥ గుత్సకః॥౧॥ స్తూయతే స్తబకః *ష్టుఞ్ స్తుతౌ। స్తో

కుట్మలో ముకుళో స్త్రియామ్।౬౨॥ స్త్రియస్సుమనసః పుష్పం ప్రసూనం కుసుమం సుమం।

త్రము చేయఁబడునది॥ ౨॥*కుట్మలముకుళశబ్దములు అప్పుడు వికసించఁగలవరువైన మొగ్గల పేళ్లు॥ కుటతి ఈషత్కుట్మలః* కుటకౌటిల్యే। ఇంచుకంత కుటిలమైయుండునది॥ ౧॥ కలికావస్థాం ముంచతీతి ముకుళః॥ అ-పు॥*ముచ్ల్ మోక్షణే । మొగ్గగానుండుటను విడుచునది ౨॥*సుమనశ్శబ్దము మొదలు ౫ పుష్పముల పేళ్లు॥ సుప్రీతం మనః ఆస్వితి సుమనసః॥ స-సీ॥ బహువచనము; దీనియందు మనస్సు తెస్సగానుండును॥ శ్లో॥ బహవశ్చ సమాస్సిక తావర్షాస్సుమనోజలౌకసో౽ప్సరసః । అని వామనమతమందు బహువచనము - ఇతరమతమునం దేకవచనంబును గలదు॥ సుమనాః కుసుమం పుష్పం- అని నామమాల॥ శ్లో॥ తస్మాన్న రేణ కులశీలసమన్వితేన వేశ్యాశ్మశానసుమనా ఇవ వర్జనీయా॥ అని శూద్రకుఁడును జెప్పియున్నాఁడు॥౧॥ పుష్ప్యతీతి పుష్పం* పుష్పవికసనే । వికసించునది॥ ౨॥ ప్రసూయత ఇతి ప్రసూనం॥*షూఞ్ ప్రాణిప్రసవే॥ పుట్టునది॥ ౩॥ కుత్యతి భ్రమరాదినా

మకరందః పుష్పరసః

శ్లిష్యతీతి కుసుమం॥*కుస శ్లేషణే॥ భ్రమరములతోఁ గూడునది॥ ౪॥ సుమం॥ ౫॥ *మకరంద పుష్పరసశబ్దములు పూదేనె పేళ్లు ॥ మంక్ష్యతే పుష్ప్యతే అనేనేతి మకరందః* మకిమండనే । దీనిచేతము పువ్వులు అలంకరింపఁబడును॥ ౧॥ పుష్పాణాం రసః పుష్పరసః । పువ్వుల యొక్క రసము ॥ ౨॥

పరాగస్సుమనోరజః॥౬౩॥

*పరాగసుమనోరజశ్శబ్దములు పుప్పొడి పేళ్లు ॥ పరాగచ్ఛతి వాయువశేనేతి పరాగః*పరాత్ పూర్వోగమ్ల్ గతావితి ధాతుః॥ వాయువశమునఁ బోవునది॥ ౧॥ సుమనసాం రజః సుమనో రజః॥ స-నః పువ్వుల యొక్క ధూళి॥ ౨॥

ద్విహీనం ప్రసవే సర్వం

*ప్రసవః ఫలం పుష్పం చ - తత్ర వర్తమానం వృక్షవాచకశబ్దస్వరూపం ద్విహీనం స్త్రీలింగపుల్లింగహీనం భవతి- నపుంసకలింగమితి యావత్ । ప్రసవమనఁగా పువ్వము - ఫలము - అందు వర్తించునట్టి సకలమైన వృక్షవాచకశబ్దరూపము స్త్రీలింగపుల్లింగహీనమైయుండును- అనఁగా నపుంసకమేయనుట- అది యెట్లన్నను- చంపకస్య పుష్పం చంపకం- ఆమ్రస్య ఫలం ఆమ్రం- ఆమలక్యాః ఫలం ఆమలకం- ఇత్యాది॥

హరీతక్యాదయః స్త్రియామ్।

*హరీతక్యాదయః వృక్షవాచినశ్శబ్దాః ఫలవృత్తావపి స్త్రియాం వర్తంతే- హరీతకీ - కోశాతకీ - ధాత్రీ- ద్రాక్షాదులు- పుష్పఫలవాచకములైనప్పుడును - స్త్రీలింగమునం దే వర్తించును॥ హరీతక్యాః ఫలం హరీతకీ - కోశాతక్యాః ఫలం కోశాతకీ- ఇత్యాదులు॥

ఆశ్వత్థవైణవప్లాక్షనైయగ్రోధైఙ్గుదం ఫలే॥౬౪॥ బార్హతంచ

*అశ్వత్థాదిశబ్దములు ౬ వరుసగా అశ్వత్థాదిఫలములకు పేళ్లు॥ అశ్వత్థస్య ఫలం అశ్వత్థం। రావిపండు ఆశ్వత్థమనంబడును ॥ వేణోరిదం వైణవం । వెదురుబియ్యము వైణవమనంబడును॥ ప్లక్షస్య ఫలం ప్లాక్షం।జువ్విపండు ప్లాక్షమనంబడును ॥ న్యగ్రోధస్య ఫలం నైయగ్రోధం। మఱ్ఱిపండు నైయగ్రోధమనంబడును॥ ఇంగుదస్య ఫలం ఐంగుదం; గారపండు ఐంగుదమనంబడును ॥ బృహత్యాః ఫలం బార్హతం। ములకపండు బార్హతమనంబడును॥

ఫలే జంబ్వా జంబూః స్త్రీ జంబు జాంబవం

*జంబూశబ్దము మొదలు ౩ నేరేడుపండ్లు పేళ్లు॥ జంబ్వాః ఫలం జంబూః ఊ-సీ॥ జంబు॥ ఉ నః జాంబవం చ। నేరేడుయొక్క పండు*

పుష్పే జాతిప్రభృతయః స్వలింగా

జాతిప్రభృతయశ్శబ్దాః పుష్పవాచకత్వేపి స్వలింగాః। జాతి వల్లికా శేఫాలికా యూధికాది శబ్దములు పుష్పవాచకములైనప్పుడును తమ తమ లింగములయందే యుండును- అనఁగా స్త్రీలింగములు॥ అది యెట్లన్నను- జాత్యాః కుసుమం జాతిః- వల్లికాయాః కుసుమం వల్లికా- ఇత్యాదులు॥

వ్రీహయః ఫలే॥౬౫॥

వ్రీహ్యాదిశబ్దములు ఫలవాచకములైనప్పుడును స్వలింగములే- అది యెట్లనిన- వ్రీహీణాం ఫలాని వ్రీహయః- ముద్గస్య ఫలం ముద్గః- మాషస్య ఫలం మాషః॥

విదార్యాద్యాస్తు మూలేపి

*విదారీ- గంభారీ - బృహత్యాదిశబ్దములు మూలవాచకములైనప్పుడును - అపిశబ్దము వలన పుష్పవాచకములైనప్పుడును స్వలింగములే॥ విదార్యాః మూలం ఫలం కుసుమం వా విదారి । గంభార్యాః మూలం ఫలం కుసుమం వా గంభారీ॥

పుష్పే క్లీబేపి పాటలా।

*పాటలాశబ్దము పుష్పవాచకమైనప్పుడు నపుంసకలింగంబును గలదు। పాటలాయాః పుష్పం పాటలం పాటలా వా

*బోధిద్రుమశ్చలదళః పిప్పలః కుంజరాశనః॥౬౬॥ అశ్వత్థే

*బోధిద్రుమశబ్దము మొదలు ౫ రావిచెట్టు పేళ్లు॥ బుధ్యతే అనేనేతి బోధిః। బోధినామా ద్రుమో బోధిద్రుమః। దీనిచేత సర్వమెఱుఁగఁబడును గనుక బోధిః॥ శ్లో॥ పిప్పలే బోధి రశ్వత్థః॥ అని రత్నమాలయందుఁ జెప్పఁబడియున్నది గనుక బోధి యనెడు వృక్షము బోధిద్రుమము॥ ౧॥ నిత్యం చలాని దళాని యస్య సః చలదళః, ఎల్లప్పుడు కదులుచుండెడు ఆకులు గలది॥ ౨॥ భక్షణే పాతి

తిపిప్పలః॥ తన్నాసేవించువారిని రక్షించునది॥ ౩॥ కుంజరాణాం అశనః కుంజరాశనః। ఏనుఁగులకు భక్షణమగునది॥ ౪॥ అశ్వరూపేణాగ్నిరస్మిన్ తిష్ఠతీత్యశ్వత్థః॥ స్థా గతినివృత్తౌ। అశ్వరూపముననిదీనియందగ్నియుండును॥ ౫॥

**కపిత్థేస్యుర్దధిత్థగ్రాహిమన్మథాః। తస్మిన్ దధిఫలః పుష్పఫలదంతశఠావపి॥ ౬౭॥**

*కపిత్థశబ్దము మొదలు ౭ వెలగచెట్టుపేళ్లు॥ కపీనాం ప్రియత్వాత్ తిష్ఠతీతి కపిత్థః। కోతులకు ప్రియమైయుండునది॥ ౧॥ దధీవ తిష్ఠతీతి దధిత్థః॥ స్థా గతినివృత్తౌ। పెరుగువలె నుండునది॥ ౨॥ విష్టంభకారిత్వాద్గ్రాహీ॥ న-పు॥ *గ్రహ ఉపాదానే। మలబంధము జేయునది॥ ౩॥ ఫలైః మనో బధ్నాతీతి మన్మథః *మంథ విలోడనే। ఫలముల చేత మనస్సును కలఁగించునది ॥౪॥ దధివదామ్లం ఫలమస్యేతి దధిఫలః। పెరుగువలె పులుసైన ఫలము గలిగినది॥ ౫॥ పుష్పాత్ఫలమస్యేతి పుష్పఫలః। పుష్పము వల్లనైన ఫలముగలది॥ ౬॥ అమ్లత్వాత్ దంతానాం శఠో దంతశఠః। పులుసౌటవలన దంతములకు శఠమైనది॥ ౭॥

**ఉదుంబరో జంతుఫలో యజ్ఞాంగో హేమదుగ్ధకః॥**

* ఉదుంబరశబ్దము మొదలు ౪ మేడిచెట్టు పేళ్లు॥ ఉన్నతత్వాదుల్లంఘితమంబరం అనేనేతి ఉదుంబరః। ఔన్నత్యము చేత నాకాశమును దాఁటినది॥ ౧॥ జంతుయుక్తం ఫలమస్యేతి జంతుఫలః। జంతువులతోఁ గూడిన ఫలము గలిగినది॥ ౨॥ యూపాదిరూపేణ యజ్ఞస్యాంగముపకరణమితి యజ్ఞాంగః। యూపాదిరూపము చేత యజ్ఞమునకంగమైయుండునది॥ ౩॥ హేమవర్ణం దుగ్ధం క్షీరమస్య హేమదుగ్ధకః। బంగారువంటి పాలుగలది॥ ౪॥

**కోవిదారే చమరికః కుద్దాలో యుగపత్రకః॥ ౬౮॥**

*కోవిదారాదిశబ్దములు ౪ ఎఱ్ఱకాంచనపుచెట్టు పేళ్లు॥ కుం భూమిం విదారయతీతి కోవిదారః॥ *దౄ విదారణే భూమిని వ్రక్కలించునది॥ ౧॥ చమరసదృశమంజరీత్వాచ్చమరికః। జుల్లులవంటి పూగుత్తులుగలది॥ ౨॥ కుంభువన్మూలైర్దళయతీతి కుద్దాలః॥ *దళ విశరణే। వేళ్లచేత భూమిని వ్రక్కలించునది॥ ౩॥ యుగం యుగ్మం పత్రమస్య యుగపత్రకః॥ జోడుగానుండునట్టి యాకులుగలది॥ ౪॥

**సప్తపర్ణో విశాలత్వక్ శారదో విషమచ్ఛదః।**

* సప్తపర్ణాదిశబ్దములు ౪ ఏడాకులఅరటి పేళ్లు॥ ప్రతిపర్వం సప్తపర్ణాన్యస్య సప్తపర్ణః। కణుపుకణుపునను ఏడేసి ఆకులుగలది॥ ౧॥ విశాలా త్వక్ యస్య సః విశాలత్వక్॥ చ-పు॥ వెడల్పైన పట్టగలది ॥ ౨ ॥ శరది పుష్ప్యతీతి శారదః। శరత్కాలమందు పూచునది ॥ పా ॥ శారదీ॥ ఈ-సీ ॥ ౩ ॥ సప్తపర్ణత్వాద్విషమాః ఛదాః యస్య సః విషమచ్ఛదః। ఏడాకులుగది ॥ ౪ ॥

**ఆరగ్వధే రాజవృక్ష శంపాక చతురంగులాః॥ ౬౯॥ ఆరేవత వ్యాధిఘాతకృతమాలసువర్ణకాః।**

*ఆరగ్వధశబ్దము మొదలు ౮ రేలచెట్టుపేళ్లు ॥ ఆరం జయంతి ఆరజో మాలాస్తేషాం వధః భేదనమస్తేతి ఆరగ్వధః॥ మాలాకారమైన ఫలములయొక్క భేదనము గలది॥ ఆరం జయంతీత్యారజః త్వగ్దోషాః- తేషాం వధో స్మాదితి ఆరగ్వధః। హాస్తము సెజ్జగాఁ జేయునవి గనుక ఆరజలు త్వగ్దోషములు వానిఁ జెఱుచునది: పా॥ ఆగ్వాగధః॥ శ్లో॥ అరగ్వధో థ సంపాకః కృతమాలస్తథాగ్వాగధ ఇతి రత్నమాలాయాం॥ ౧॥ రాజ్ఞాంచాసౌ వృక్షశ్చ రాజవృక్షః। వృక్షశ్రేష్ఠము॥ *రోగరాజం వృశ్చతి ఛినత్తి వా రాజవృక్షః॥ ఓవ్రశ్చూ ఛేదనే। రోగరాజమును జెఱుచునది॥ ౨॥ శమీం అకత్వాదుగచ్ఛతీతి శమ్యాకః। అకఅగ కుటిలాయాంగతౌ। జమ్మిని అనుకరించునది॥ పా॥ సమ్యక్ పాకో స్త్ర సంపాకః॥ మంచి పాకము గలది॥ పా ॥ శం కల్యాణం పాకో స్త్ర శంపాకః। శుభకరమైన పాకముగలది ॥ ౩॥ చతురంగుళపర్ణపర్వకత్వాచ్చతురంగులః। నాలుగంగుళములు గలిగిన- ఆకుయిగల కణుపులుగలది॥ ౪॥ అరేవతే ఫప్లు త్యాగచ్ఛత్యనేన రోగ ఇత్యారేవతః- రేవృ ప్లవగతౌ। రోగము దీని చేత నెగసిపోవును॥ ౫॥ వ్యాధిం హంతీతి వ్యాధిఘాతః: వ్యాధిని జెఱుచునది॥ ౬॥ ఫలైః కృతా మాలా యస్య సః కృతమాలః॥ ఫలముల చేతఁ జేయఁబడిన వరుసగలది॥ ౭॥ సువర్ణాకారాణి పుష్పాణి యస్య సః సువర్ణకః। బంగారువన్నె పుష్పములు గలది॥ ౮ ॥

**స్యుర్జంబీరే దంతశఠ జంభ జంభీర జంభలాః॥ ౭౦॥**

* జంబీరశబ్దము మొదలు ౫ నిమ్మచెట్టుపేళ్లు॥ జమ్యతే భక్ష్యత ఇతి జంబీరః॥ జము అదనే। భక్షింపఁబడునది ॥ ౧ ॥ దంతానాం శఠః అమ్లత్వాద్దంతశఠః। పులుసౌట చేత దంతములకు శఠమైనది ॥ ౨ ॥ జంభయతి మోహయతీతి జంభః - జంభీరః- జంభలశ్చ॥ జభ గాత్రవినామే। మోహింపఁ జేయునది జంభము- జంభీరము- జంభలము॥ ౫॥

**వరుణో వరణస్సేతుస్తిక్తశాకః కుమారకః।**

*వరుణశబ్దము మొదలు ౫ ఉలిమిరి చెట్టుపేళ్లు॥ వృణోతీతి వరుణః। వరణశ్చ చుట్టుకొనియుండునది॥ ౧॥ ౨॥ వ్యాధిం సినోతీతి సేతుః। ఉ-పు॥ షిఞ్ బంధనే। వ్యాధిని బద్ధగించునది॥ ౩॥ తిక్తరసశ్శాకో యస్య సః తిక్తశాకః। చేఁదైన ఆకులుగలది॥ ౪॥ సదా తరుణత్వాత్ కుమారకః ఎల్లప్పుడు కోమలమైయుం

ఆమ్రశ్చూతో రసాలో

సౌసహకారోతిసౌరభః॥ ౭౯ ॥

కుంభోలూఖలకం క్లీబే కౌశికో గుగ్గులుః పురః।

శేలుః శ్లేష్మాతకశ్శీత ఉద్దాలో బహువారకః॥ ౮౦ ॥

రాజాదనం ప్రియాలస్స్యాత్ సన్నకద్రుర్ధనుఃపటః।

గంభారీ సర్వతోభద్రా కాశ్మరీ మధుపర్ణికా॥ ౮౧ ॥ శ్రీపర్ణీ భద్రపర్ణీ చ కాశ్మర్యశ్చ

పృథక్త్వయోః। కర్కంధూర్బదరీ కోలీ ఘోంటా

తిలస్నేహానే। దీని చేత శరీరము నున్న నౌను॥ ౫॥ మార్జయతి ఉద్వర్తనాయత్వాంగమనేనమార్జనః॥ మృజా శుద్ధౌ। దీని చేత అంగము పరిశుద్ధమౌను॥ ౬॥ ఆమ్రశబ్దము మొదలు ౩ మామిడి చెట్టు పేళ్లు అమ్యతే అభిలష్యతే ఆమ్రః॥ అమగత్యాదిషు। అభిలషింపఁబడునది॥ అమయతి రోగయతి వా ఆమ్రః అమ రోగే। రోగమును జేయునది॥ ౧॥ చ్యోతతి రసం స్రవతీతి చూతః॥ చ్యుతిర్ క్షరణే। రసమును స్రవించునది॥ ౨॥ రసం ఆలాతీతి రసాలః॥ లా దానే। రసమును నిచ్చునది॥ రసమలతి భూషయతి వా రసాలః॥ అల భూషణాదౌ। రసమునలంకరించునది॥ ౩॥ ఏకికరాలి పరిమళము గల మామిడి సహకార మనంబడును॥ సహకారయతి మేళయతి స్త్రీపుంసావితి సహకారః॥ కృఞ్ కరణే। స్త్రీ పురుషు లఁ గూడఁ జేయునది॥ ౧॥ కుంభోలూఖలకశబ్దము మొదలుర గుగ్గిలపు చెట్టు పేళ్లు॥ కుంభోలూఖల కశబ్దము ఏకనామమని కొందరు - ఇందు దాహరణము॥ శ్లో॥ కుంభోలూఖలకం క్లీబే గుగ్గులుః ప్రావృషాయణీ - అని హేమచంద్రుఁడు। కుంభం - ఉలూఖలం - అని నామద్వయమని కొందరు - ఉదాహరణము॥ శ్లో॥ కాముకే వరనార్యాశ్చ కుంభః క్లీబం చ గుగ్గులౌ॥ ఉలూఖలే గుగ్గులౌ చ ... ఉలూఖలం - అని రభసుఁడు॥ కుంభోలూఖలాకారాత్ వృక్షకోశాన్నిర్యాతి కుంభోలూఖలకం। కుంభాకారమైనటులూఖలాకారమైనమాని మోసువలనఁ బుట్టునది॥ ౧॥ కుంభోలూఖలకే కోశభవః కౌశికః। మొగ్గలవలెనుండెడు నోసువలనఁ బుట్టునది॥ ౨॥ గుడతి వాతరోగాద్గుగ్గులుః॥ ఉ-పు॥ గుడ రక్షణే। వాతరోగమువలన రక్షించునది॥ ౩॥ పురతి అగ్రేసరతి ధూపవృక్షేష్వితి పురః॥ పుర అగ్రగమనే। ధూపవృక్షములయందు - అగ్రేసరమైనది॥ ౪॥ శేలుశబ్దము మొదలుర విరిగి చెట్టు పేళ్లు॥ శినోతి రోగాన్ శేలుః॥ ఉ-పు॥ శిఞ్ నిశాతనే। రోగములను అల్పముగాఁ జేయునది॥ ౧॥ శ్లేష్మాణమాతయతీతి శ్లేష్మాతకః॥ అత సాతత్యగమనే। శ్లేష్మము ను - ఎల్లప్పుడు పోఁగొట్టునది॥ ౨॥ విరుద్ధలక్షణయా శీతవీర్యత్వాచ్ఛీతః॥ ఉష్ణమును జేయునది॥ ౩॥ ఉద్దాలయత్యంగముద్దాలకః॥ దళ విదారణే। శరీరమును పగల్చునది॥ ౪॥ బహువృణోతి స్రోతాంసి బహువారకః॥ వృఞ్ వరణే। బహుళముగా ప్రవాహములను చుట్టువారియుండునది॥ ౫॥ రాజాదనశబ్దము మొదలుర మొరవి చెట్టు పేళ్లు॥ రాజ్ఞామదనం భక్ష్యత్వాత్ రాజాదనం॥ అద భక్షణే। రాజులకు భక్ష్యమైనది॥ ౧॥ ప్రీయతి అతిరసత్వాత్ హృదయం గచ్ఛతీతి ప్రియాలః॥ ప్రియగతౌ। అత్యంతరసము గలది గనుక హృదయమును బొందునది। పు॥ పియాలః॥ ౨॥ సన్నః కద్రుస్సన్నః ధ్వోస్యస న్నకద్రుః పలుచనైన కొమ్మలు గలది॥ ౩॥ ధనుష ఇవ పటో విస్తారోస్య ధనుఃపటః। ధనుస్సువంటి విస్తారము గలది॥ ఉక్తరీత్యా - ఏకం నామేతి కేచిత్॥ శ్లో॥ సన్నకద్రుశ్చాపపటో లవణస్తాపసప్రియ ఇతి నిఘంటుః॥ ధనుః - పట ఇతి నామద్వయమితి కేచిత్ - తదా ధనుశ్శబ్ద ఉకారాంతః॥ ధనుః ప్రియాళద్రుమ రాశి భేదయోశ్చ రాసన ఇతి। పటః ప్రియాళవృక్షే నా సుచేలే పున్నపుంసకమితిచ రభసః॥ ధనుఃపటః - అనియొక నామమని కొందరు॥ ధనుః - పటః అని నామద్వయమని కొందరు॥ గంభారీశబ్దము మొదలు ౭ గుమ్ముడు చెట్టు పేళ్లు॥ సారవత్వాత్ గమనేన భారోస్యా అస్తీతి గంభారీ॥ ఈ-స్త్రీ॥ సారము గలది గనుక గమనమందు భారము గలది॥ ౧॥ సర్వతో భద్రమస్యా ఇతి సర్వతోభద్రా। అంతటను భద్రము గలది॥ ౨॥ కృశ్యతీతి తనూకరోతి పిత్తాదికమితి కాశ్మరీ॥ ఈ-స్త్రీ॥ కృశ తనూకరణే। పైత్యాదులను కృశముగాఁ జేయునది॥ పా॥ కషతి పిత్తాదికమితి కాష్మరీ॥ కష హింసాయాం। పిత్తాదులను పోఁగొట్టునది॥ ౩॥ మధూని స్వాదూని పర్ణాన్యస్యా మధుపర్ణికా। తియ్యనైన ఆకులు గలది॥ ౪॥ శ్రీప్రదాని పర్ణాన్యస్యాస్సా శ్రీపర్ణీ॥ ఈ-స్త్రీ॥ ౫॥ భద్రప్రదాని పర్ణాన్యస్యాస్సా భద్రపర్ణీ॥ ఈ-స్త్రీ॥ శుభప్రదమైన ఆకులు గలది॥ ౬॥ కృశ్యతీతి తనూకరోతి పిత్తాదికమితి కాశ్మర్యః॥ కృశ తనూకరణే। పిత్తాదులనల్పముగాఁ జేయునది॥ పా॥ కాష్మర్యః॥ ౭॥ కర్కంధూశబ్దము మొదలు ౪ రేఁగు చెట్టు పేళ్లు॥ కర్కాః లోహితాని పర్ణాని ఫలాని చ ధత్త ఇతి కర్కంధూః॥ ఊ-స్త్రీ॥ డుధాఞ్ ధారణపోషణయోః॥ కరకమనఁగా ఎఱుపు - అటువంటి ఆకులును పండ్లును గలది॥ ౧॥ బదతీతి బదరీ॥ ఈ-స్త్రీ॥ బద స్థైర్యే। స్థిరమైయుండునది॥ ౨॥ కోలతి నిబిడావయవత్వాత్ కోలీ॥ ఈ-స్త్రీ॥ కుల సంస్త్యానే। దట్టమైయుండునది॥ ౩॥ ఘుణతి వృత్తలియాభ్రమతీతి ఘోంటా॥ ఘుణ ఘూర్ణ భ్రమణే।

తికప్పుకొనియుండునది॥౩॥ కట్యతే ప్రకర్షేణ లక్ష్యతే తైర్దర్శ్యః॥ కడమచే। మిక్కిలి కానఁబడును
ది॥ కంఠసంతోషే స్త్వాద్రుతి కైదర్యః॥ ఈడవన్ధత్తే। రసమును స్తోత్రముఁ జేయునది॥౪॥ కటూని ఫలాన్యస్య
స్యేతి కట్ఫలః। కారములైన ఫలములు గలది॥౫॥ ॥క్రముకశబ్దము మొదలు ౭ ఎఱ్ఱలొద్దుగ పేర్లు॥ క్రా

క్రముకః పట్టికాఖ్యస్స్యాత్పట్టీ లాక్షా ప్రసాదనః।

మతీతి క్రముకః॥ కము పాదవిక్షేపే। అక్రమించునది॥౧॥ పట్టికా ఇత్యాఖ్యా యస్య సః పట్టికాఖ్యః॥
పట్టిక యనెడు పేరుగలది॥౨॥ పట్టో వ్రణబంధనసామగ్ర్యా మస్యాస్తీతి పట్టీ॥ న-పు॥ ఘనమైన పట్టు
గలది॥౩॥ లాక్షా ప్రసాదయతీతి లాక్షాప్రసాదనః॥ షద్ల్ విశరణగత్యవసాదనేషు। లక్క-
ను అలంకరించునది॥౪॥ ॥తూదశబ్దము మొదలు ౬ గంగరావి చెట్టు పేర్లు॥ తుద్యతే యూపార్థం తూ

తూదస్తు యూపః క్రముకో బ్రహ్మణ్యో బ్రహ్మదారు చ॥౧౭॥ తూలం చ

దః॥ తుద వ్యథనే। యూపార్థమై వ్యథపెట్టఁబడునది॥ పా॥ నూదః॥౧॥ యూపార్హత్వాద్యూ
పః। యూపమునకు అర్హమైనది॥ పా॥ పునాతీతి పూగః॥ పూఙ్ పవనే। పరిశుద్ధము సేయునది॥౨॥
క్రామతీతి క్రముకః॥ అక్రమించునది॥౩॥ బ్రహ్మణి వైదికకర్మణి సాధుః బ్రహ్మణ్యః। వైదికకర్మమందు
మంచిది॥౪॥ బ్రహ్మణే వైదికకర్మణే యోగ్యం దారు బ్రహ్మదారు। వైదికకర్మమునకు తగిన మంచి
కృష్ఠము॥౫॥ తూల్యతే నిష్పాద్యతే అగ్నిరనేన తూలం॥ తూల నిష్కర్షణే। దీనివలన అగ్నిపైలు వెళ్లును॥౬॥

నీపప్రియకకదంబాస్తు హలిప్రియే।

॥నీపశబ్దము మొదలు ౪ కడప చెట్టు పేర్లు॥ నయతి ప్రాణినస్సుఖం నీపః॥ ణీఞ్ ప్రాపణే। ప్రాణులను సు
ఖమును పొందించునది॥౧॥ ప్రీణాతీతి ప్రియకః॥ ప్రీఞ్ తర్పణే। ప్రీతిని చేయునది॥౨॥ కం వాతం దమ
యతీతి కదంబః॥ దము ఉపశమే। వాతమును శమింపఁజేయునది॥౩॥ హలిః హలభద్రస్య ప్రియః
సురాధివాసాత్ హలిప్రియః మద్యస్థానమౌటచేత బలభద్రునికి ప్రియమైనది॥౪॥ ॥వీరవృక్షశబ్ద

వీరవృక్షోఽరుష్కరోఽగ్నిముఖీ భల్లాతకీ త్రిషు॥౧౮॥

ము మొదలు ౫ జీడిమాని పేర్లు॥ వీరాణాముపస్పర్శాయోగ్యో వృక్షః వీరవృక్షః। అత్యుష్ణమైనదిగను
క వీరులకే స్పర్శయోగ్యమైనది॥౧॥ అరూంషి వ్రణాన్ కరోతీతి అరుష్కరః। అరుస్సులనఁగా వ్రణ
ములు-వాటిని చేయునది॥౨॥ అగ్నివన్ముఖమస్యా అగ్నిముఖీ॥ ఈ-సీ॥ అగ్నివంటి ముఖముగలది॥౩॥
భల్ల ఇవాతతీతి భల్లాతకీ॥ త్రి॥ అత సాతత్యగమనే। అంబువలె పోవునది॥౪॥ ॥గర్దభాండశబ్దము మొద

గర్దభాండే కందరాలకపీతనసుపార్శ్వకాః ప్లక్షశ్చ

లు ౫ కలజువ్వి చెట్టు పేర్లు॥ గర్దభ ఇవ అండం ఫలమస్య గర్దభాండః। గర్దభమువంటి పండ్లుగలది॥౧॥
కందరమలతీతి కందరాలః॥ అల భూషణాదౌ। గుహాప్రదేశమును అలంకరించునది॥౨॥ కం జలం పీతయ
తీతి కపీతనః। జలమును పచ్చగాఁ జేయునది॥౩॥ శోభనౌ పార్శ్వౌ యస్య సః సుపార్శ్వకః। మం
చి పార్శ్వములుగలది॥౪॥ ప్లక్ష్యతే భక్ష్యత ఇతి ప్లక్షః॥ ప్లక్ష భక్షణే। భక్షింపఁబడునది॥౫॥

తింత్రిణీ చించాఽమ్లికా

॥తింత్రిణీశబ్దములు ౩ చింత చెట్టు పేర్లు॥ తిమ్యతి ముఖమనేనేతి తింత్రిణీ॥ ఈ-సీ॥ తిమ ఆర్ద్రీభావే।
దీనిచేత ముఖము అర్ద్రమవును॥ పా॥ తింతిడీ॥౧॥ చించి మాయతె ముఖమునబెతి చించా। దీనిచేత ము
ఖము చిమచిమమనును॥౨॥ అమ్లరసత్వాదామ్లికా। పులుసైనది॥౩॥ ॥పీతసాలశబ్దము మొదలు ౭ వే

థ పీతసాలకే॥౧౯॥ సర్జకాసనబంధూకపుష్పప్రియకజీవకాః।

గిమాని పేర్లు॥ పీతవర్ణస్సాలః పీతసాలకః। పచ్చనివృక్షము॥ పా॥ పీతవర్ణస్సారోస్యాస్తీతి పీత
సారకః। పచ్చని చేవగలది॥౧॥ సృజతి నిర్యాసం సర్జకః॥ సృజ విసర్గే। బంకను పుట్టించునది॥౨॥ అ
స్యతి హస్తాదీన్ ఇత్యసనః॥ అసు క్షేపణే। హస్తాదులను పోఁగొట్టునది॥౩॥ బంధూకస్యేవ రక్తాని పు
ష్పాణి యస్య స బంధూకపుష్పః। మంకెనపువ్వువలె నెఱ్ఱనైన పువ్వులుగలది॥౪॥ ప్రీణాతీతి ప్రియకః॥
ప్రీఞ్ తర్పణే। ప్రీతిని చేయునది॥౫॥ హస్తరోగిణం జీవయతీతి జీవకః॥ జీవ ప్రాణధారణే। హస్తరో

సాలే తు సర్జకార్శ్యాశ్వకర్ణకాస్సస్యసంవరః॥౨౦॥

గులను బ్రతికించునది॥౬॥ ॥సాలశబ్దము మొదలు ౫ మద్ది చెట్టు పేర్లు॥ స్యతి హస్తరోగానితి సాలః॥
షోఽన్తకర్మణి। హస్తరోగములను చెఱుచునది॥౧॥ సృజతి నిర్యాసం సర్జః॥ సృజ విసర్గే॥౨॥ కృశయతి హస
్తాదీన్ కార్శ్యః॥ కృశ తనూకరణే। హస్తాదుల కృశముగాఁ జేయునది॥ పా॥ కార్ష్యః॥౩॥ అశ్వక
ర్ణాకారాణి పత్రాణ్యస్య అశ్వకర్ణకః। గుఱ్ఱపు చెవులవంటి ఆకులుగలది॥౪॥ సస్యం ఫలం సంవృణోతీ
తి సస్యసంవరః॥ వృఞ్ వరణే। సస్యమనఁగా ఫలము - దాన్ని కప్పుకొని యుండునది॥౫॥

నదీసర్జో వీరతరురింద్రద్రుః కకుభోఽర్జునః।

॥నదీసర్జశబ్దము మొదలు ౫ ఎఱ్ఱమద్ది పేర్లు॥ నద్యాం భవః సర్జో నదీసర్జః। నదియందుఁ బుట్టిన మద్ది॥౧॥
వీరో జజ్ఞేన తస్మాదుకవ్యాద్వీరతరుః॥ ఉ-పు॥ వీరుఁడనఁగా అర్జునుఁడు అతని పేరుగలది॥౨॥ ఇంద్ర

రాజాదనః ఫలాధ్యక్షః క్షీరికాయామథ ద్వయోః ॥౧॥
ఇంగుదీ తాపసతరుర్భూర్జే చర్మిమృదుత్వచౌ।
పిచ్ఛిలా పూరణీ మోచా చిరాయుః శాల్మలిర్ద్వయోః ॥౨॥
పిచ్ఛా తు శాల్మలీవేష్టే
రోచనః కూటశాల్మలిః। చిరిబిల్వో నక్తమాలః కరజశ్చ కరంజకే ॥౩॥
ప్రకీర్యః పూతికరజః పూతికః కలికారకః।
కరంజభేదాః షడ్గ్రంథో మర్కట్యంగారవల్లరీ ॥౪॥
రోహీ రోహితకః ప్లీహశత్రుర్దాడిమపుష్పకః।
గాయత్రీ బాలతనయః ఖదిరో దంతధావనః

స్యాత్ప్రియో గుః ఇంద్రద్రుః। అర్జుననామకమవుట చేత నింద్రునికి ప్రియమైన వృక్షము॥ ౩॥ శాఖాభిః కకుభః। కొమ్మల చేత దిక్కులను వ్యాపించునది॥ కం శీతం కుభ్నాతీతి వా కకుభః। శీతమునడ్డగించునది॥ ౪॥ శుక్లత్వాదర్జునః। తెల్లనైయుండునది॥ ౫॥ *రాజాదన శబ్దము మొదలు ౩ పాలచెట్టు పేర్లు॥ రాజభిరద్యత ఇతి రాజాదనం। రాజుల చేత భక్షింపబడునది॥ ౧॥ అధ్యాని శ్రేష్ఠాని ఫలాన్యస్య ఫలాధ్యక్షః॥ శ్రేష్ఠమైన ఫలములు గలది॥ ౨॥ క్షీరవన్మధురాణి ఫలాన్యస్యాః క్షీరికా। పాలవలె తియ్యనైన పండ్లు గలది॥ ౩॥ *ఇంగుదీ తాపసతరు శబ్దములు-గార చెట్టు పేర్లు॥ ఇంగతి ఊర్ధ్వం గచ్ఛతీతి ఇంగుదీ॥ ఈ-సీ॥ *ఇగి గత్యర్థః। ఊర్ధ్వముగాబోవునది॥ పా॥ ఇంగుదః॥ ౧॥ తపస్విజనోపయుజ్యమానత్వాత్తాపసతరుః। తాపసులకుపయోగించునట్టి ఫలములు గలది॥ ౨॥ *భూర్జశబ్దము మొదలు ౩ భుజపత్రపు చెట్టు పేర్లు॥ భూరిత్యవ్యయం- భూః భూమౌ జాయత ఇతి భూర్జః॥ *జనీ ప్రాదుర్భావే। భూమియందు బుట్టునది॥ ౧॥ చర్మాకార పత్రయోగాచ్చర్మీ॥ న-పు॥ చర్మము వంటి ఆకులు గలది॥ ౨॥ మృద్వీ త్వగస్య మృదుత్వక్॥ న-పు॥ మెత్తని చర్మము వంటి ఆకులు గలది॥ ౩॥

*పిచ్ఛిలా శబ్దము మొదలు ౫ బూరుగ చెట్టు పేర్లు॥ పిచ్ఛాస్యాస్తీతి పిచ్ఛిలా। బంకగలిగినది॥ ౧॥ పూరయతి తూలేన ఫలానీతి పూరణీ॥ ఈ-సీ॥ పూరీ అప్యాయనే। దూది చేత ఫలములను నిండించునది॥ ౨॥ రసం ముంచతీతి మోచా॥ *ముచ్ ఌ మోక్షణే। రసమును విడుచునది॥ ౩॥ చిరమాయుర్యస్య చిరాయుః॥ స-పు॥ చిరకాలముండునది। తథాచ॥ శ్లో॥ షష్టిర్వర్షసహస్రాణి వనే జీవతి శాల్మలిరితి॥ పా॥ స్థిరమాయుర్యస్య చిరజీవిత్వాత్ స్థిరాయుః। అనేకకాలములుండునది॥ ౪॥ విటపైః శల్యత ఇతి శాల్మలిః॥ ఇ-పు॥ విస్తారము చేత కొనియాడబడునది॥ పా॥ శల్మలిః॥ ౫॥

*పిచ్ఛా శాల్మలీవేష్ట శబ్దములు బూరుగబంక పేర్లు॥ పరాంగుళిసంగాత్ పిచ్ఛా। వ్రేలికి అంటుకొనునది॥ ౧॥ శాల్మలిం వేష్టయతీతి శాల్మలీవేష్టః। బూరుగను చుట్టు వారియుండునది॥ ౨॥

*రోచనకూటశాల్మలీ శబ్దములు కొండబూరుగ చెట్టు పేర్లు॥ రోచతే రోచనః-రుచ దీప్తౌ। ప్రకాశించునది॥ ౧॥ కూటా కుత్సితా చాసౌ శాల్మలీ చ కూటశాల్మలిః। కుత్సితమైన బూరుగ॥ ౨॥ *చిరిబిల్వ శబ్దము మొదలు ౪ కానుగ చెట్టు పేర్లు॥ చిరేణ రోగం బిలతీతి చిరిబిల్వః - బిల భేదనే। చిరకాలరోగమును భేదించునది॥ ౧॥ నక్తమలతి మండయతీతి నక్తమాలః - అల భూషణాదౌ। రాత్రిని అలంకరించునది॥ నక్తం రాత్రౌ భూతాశ్రయత్వాదలమనర్థోస్యాదితి వా నక్తమాలః। భూతాశ్రయము గనుక రాత్రి దీని వలన అనర్థము గలుగును॥ పా॥ నక్తమాలః॥ ౨॥ కం జలం రంజయతీతి కరజః। కరంజశ్చ - రంజ రాగే। జలమును రంజింగా జేయునది॥ ౩॥ ౪॥ *ప్రకీర్య శబ్దము మొదలు ౪ నెమలి కానుగ చెట్టు పేర్లు॥ ప్రకీర్యతే కలహస్థానే ప్రకీర్యః *కౄ విక్షేపే। కలహస్థానమందు చల్లబడునది॥ పా॥ ప్రకిర్యః॥ ౧॥ పూతిగంధః కరజః పూతికరజః। దుర్గంధము గల కానుగ॥ ౨॥ దుర్గంధత్వాత్ పూతికః। దుర్గంధము గలది॥ ౩॥ కలేః కలహస్య కారకః కలికారకః॥ కలహమును చేయుచునది॥ పా॥ కలింకరోతీతి కలికారకః। కలహమును జేయునది॥ ౪॥

*షడ్గ్రంథ శబ్దము మొదలు ౩ కానుగ భేదముల పేర్లు॥ షడ్గ్రంథయోస్య షడ్గ్రంథః। ఆరుగణుపులు గలది షడ్గ్రంథము। ఆరుగణుపులు గల కానుగ॥ ౧॥ మర్కటవర్ణత్వాన్మర్కటీ॥ ఈ-సీ॥ కోతివన్నె గలది। ఇది తీగె కానుగ॥ ౨॥ *అంగారవత్ పర్ణాని వల్లర్యోస్యాస్సంతీత్యంగారవల్లరీ॥ ఈ-సీ॥ నిప్పువన్నె పూగుత్తులు గల కానుగ॥ ౩॥ *రోహీ శబ్దము మొదలు ౪ మొల్లమోదుగ పేర్లు। ఛిన్నోపి ప్రరూఢో రోహతీతి రోహీ॥ న-పు॥ రోహితకశ్చ *రుహ బీజజన్మని ప్రాదుర్భావే। నరకబడియు మొలుచునది-రోహి-రోహితకము॥ ౧॥ ౨॥ ప్లీహాఖ్యస్య రోగస్య శత్రుః। ప్లీహమనెడు రోగమునకు శత్రువు॥ ౩॥ దాడిమస్యేవ పుష్పాణ్యస్య దాడిమపుష్పకః। దాడిమ పుష్పముల వంటి పుష్పములు గలది॥ ౪॥ *గాయత్రీ శబ్దము మొదలు ౬ చండ్ర చెట్టు పేర్లు॥ గాయంతం త్రాయత ఇతి గాయత్రీ॥ ఈ-సీ॥ గా

సః॥౯౫॥

అరిమేదో విట్ఖదిరే కదరః ఖదిరే సితే। సోమవల్కో-

ఽప్యథ వ్యాఘ్రపుచ్ఛగంధర్వహస్తకౌ॥౯౬॥ ఏరండ ఉరుబూకశ్చ రుచకశ్చిత్రకశ్చ సః। చంచుః పంచాంగులో మండవర్ధమానవ్యడంబకాః॥౯౭॥

అల్పా శమీ శమీరః స్యాచ్ఛమీ సక్తుఫలా శివా।

పిండీతకో మరువకః శ్వసనః కరహాటకః॥౯౮॥ శల్యశ్చ మదనే

శక్రపాదపః పారిభద్రకః। భద్రదారు ద్రుకిలిమం పీతదారు చ దారు చ॥౯౯॥ పూతికాష్ఠం చ సప్త స్యుర్దేవదారుణ్య

యంతులనఁగా వైద్యులు- వారినిరక్షించునది॥౧॥ బాలాః సూక్ష్మాః పత్రాత్మకాః స్తనయా యస్య సః బాలతనయః। సూక్ష్మములైనపత్రరూపములైనకొమ్మలుగలది॥౨॥ ఖదతిస్థిరీభవతీతి ఖదిరః॥ ఖద స్థైర్యే। స్థిరమైయుండునది॥ ౩॥ దంతాన్ ధావయత్యనేనదంతధావనః॥ ధావుగతిశుద్ధ్యోః। దంతములనుదీనిచేత పవిత్రముచేయుదురు॥ ౪॥॥ అరిమేదవిట్ఖదిరశబ్దములుదుర్గంధపుచెంద్రచెట్టుపేళ్లు॥ వెలిదుమ్మపేళ్లనికొందరు॥ అరిదుస్సహో మేదః సారోఽస్య అరిమేదః। దుస్సహమైనమెదడువాసనగలది॥౧॥ విడ్గంధీ ఖదిరో విట్ఖదిరః। విష్ఠవంటికంపుగలది॥౨॥ ॥కదరసోమవల్కశబ్దములు వెలిచంద్రచెట్టుపేళ్లు కుత్సితం రోగం ద్యతి దారయతీతి కదరః॥ దోఽవఖండనే। కుత్సితమైనరోగమును గొట్టివేయునది॥౧ సోమవత్ చంద్రవత్సితః వల్కః వలకలమస్య సోమవల్కః। చంద్రునివలె తెల్లనైనపట్టగలది॥౨॥ ॥వ్యాఘ్రపుచ్ఛశబ్దములు౧౧ ఆముదపుచెట్టుపేళ్లు॥ వ్యాఘ్రపుచ్ఛాకారశాఖాయోగాద్వ్యాఘ్రపుచ్ఛః। పులితోకవంటికొమ్మలుగలది॥ గంధర్వస్యమృగవిశేషస్య ఘోటకవిశేషస్యవా హస్తఇవపత్రమస్యగంధర్వహస్తకః। గంధర్వమనఁగా మృగవిశేషముగాని ఘోటకవిశేషముగాని-దానిచేతివలెనుండెడుఆకులుగలది॥౨॥ ఈరయతి వాతం ఏరండః॥ ఈర క్షేపే వాతమునుపోఁగొట్టునది॥ ౩॥ ఉరుభృశంనాతంవాతినాశయతీతి ఉరుబూకః॥ వాగతిగంధనయోః పబయోరభేదః। మిక్కిలివాతమునపోఁగొట్టునది॥౪॥ రోచతేపర్ణైః రుచకః॥ రుచదీప్తౌ। ఆకులచేతప్రకాశించునది॥౫॥ రుబుకః॥౬॥ చిత్రవర్ణత్వాచ్చిత్రకః। చిత్రమైనవర్ణముగలది॥౭॥ చంచతి వాయునా చంచుః॥ ఉ-పు॥ చంచగతౌ। వాయువుచేతకదులునది॥౮॥ పంచఅంగులయః పత్రాత్మకాహస్తేఅస్యేతి పంచాంగులః। ఆకులనెడుహస్తమందుఅయిదుఅంగుళములుగలది॥౯॥ మండయతిస్వప్రదేశం మండః॥ మడిభూషాయాం। తనప్రదేశమునలంకరించునది। అమండః అమండః అనియు గలదు. శ్లో॥ గంధర్వహస్తకోమండఆమండో వ్యాఘ్రపర్ణక ఇతిశారపాలః॥౯॥ యత్రకాపివర్ధతే వర్ధమానః॥ వృధువృద్ధౌ। ఎక్కడనైనవృద్ధిఁబొందునది॥౧౦॥ వ్యడంబరోగం హంతుం వ్యడంబకః॥ అడఉద్యమనే। రోగమునుపోఁగొట్టుటకొఱకువిశేషముగానుద్యోగించునది॥౧౧॥ ॥చిన్నజమ్మిశమీరమనంబడును॥ అల్పా శమీ శమీరః। అల్పమైనజమ్మి॥౧॥ ॥శమీశబ్దము మొదలు ౩ జమ్మిచెట్టుపేళ్లు॥ శమయతిదోషాన్ శమీ॥ ఈ-సీ॥ శముఉపశమే। దోషములనుశమింపఁజేయునది॥౧॥ సక్తుతస్స్వాదూని ఫలాన్యస్య సక్తుఫలా। సక్తువలెస్వాదువైనఫలములుగలది॥౨॥ దోషశమనాచ్ఛివా। దోషశమనమువలనశుభస్వరూపమైనది॥ ౩॥ ॥పిండీతకశబ్దము మొదలు ౬ మంగచెట్టుపేళ్లు॥ స్వల్పం పిండీభావమితః ప్రాప్తః పిండీతకః॥ ఇణ్ గతౌ। దీనిఫలముకొంచెము పిండీభావమును పొందును॥ ౧॥ విషపుష్పత్వాత్ మ్రియంతేఽనేన మరువకః॥ మృఙ్ ప్రాణత్యాగే। విషపుష్పముగనుక జనులుదీనిచేత చత్తురు॥ ౨॥ శ్వసంత్యనేనరోగహారత్వాత్ శ్వసనః॥ శ్వసప్రాణనే। రోగహారముగనుక దీనిచేతబ్రతుకుదురు ॥ ౩ ॥ దుస్పర్శత్వాత్ కరం హంతీతి కరహాటకః॥ హనహింసాగత్యోః। దుష్టమైనస్పర్శముగలదిగనుక కరమునుపీడించునది॥ శల్యం కంటకమస్యాస్తీతి శల్యః। ముండ్లుగలది॥ ౪॥౫॥ మదయతీతి మదనః॥ మదీహర్షగ్లపనయోః। హర్షింపఁజేయునది॥౬॥ ॥ శక్రపాదపశబ్దము మొదలు ౯ దేవదారుచెట్టుపేళ్లు॥ శక్రస్యప్రియః పాదపః శక్రపాదపః। ఇంద్రునికిప్రియమైనవృక్షము॥౧॥ పారినిస్తీర్ణం ప్రాప్తం భద్రమస్య పారిభద్రకః। అంతటపూర్ణమైనశుభముగలది॥ ౨॥ భద్రం చ తత్ దారు చ భద్రదారు॥ ఉ-న॥ శుభమైనదారువు॥ ౩॥ ద్రోః స్కంధే కిలిమం నిర్యాసోఽస్య ద్రుకిలిమం। కొమ్మలయందుబంకగలది ॥ ద్రుకిలిమమితి నామద్వయమితి కేచిత్॥ శ్లో॥ దేవదారుస్మృతం దారుసురాహ్వం కిలిమం చ తదితిధన్వంతరిః॥౪॥ పీతవర్ణం దారు పీతదారు। పచ్చనిదారువు॥౫॥ పూతిదారు॥౬॥ దీర్యత ఇతి దారు॥ దౄవిదారణే। కొట్టఁబడునది॥ ౭॥ పూతిః ఉగ్రగంధం కాష్ఠమస్యేతి పూతికాష్ఠం। ఉగ్రగంధముగల కాష్ఠము॥ ౮॥ దేవానాం దారు దేవదారు। దేవతలయొక్క వృక్షము॥ అయం పుల్లింగేఽపి॥ శ్లో॥ అముం పురః పశ్యసి దేవదారుమితి రఘువంశే కాళిదాసః॥ ౯॥

౨౯

జ్యేష్ఠే దారపరిగ్రహాత్॥ ౫౩ ॥ పరివిత్తిస్తు తజ్జ్యాయాన్

పెండ్లాడుటవలన - వాఁడు పరివేత్తయనంబడును॥ పరిత్యజ్య జ్యేష్ఠం వధూం విందతీతి పరివేత్తా॥ ఋ-పు॥ విద్ ల్ లాభే। అన్నను విడిచి పెండ్లాఁడినవాఁడు॥౧॥ * వానితోడ బుట్టిన అన్న పరివిత్తియనంబడును॥ పరివృత్యతే శ్రాద్ధాదౌ పరివిత్తిః॥ ఇ-పు॥ శ్రాద్ధాదులయందు పరిత్యజింపబడువాఁడు* పరిత్యజ్య యం వధూం విందతి యస్య అనుజః స పరివిత్తిః। ఎవని విడిచి తమ్ముఁడు పెండ్లాడునో వాఁడు పరివిత్తి

వివాహోపయమౌ సమౌ। తథా పరిణయోద్వాహోపయామాః పాణిపీడనమ్॥ ౫౭ ॥

కవివాహశబ్దము మొదలు ౬ పెండ్లి పేళ్లు॥ విశేషేణ వహనం వివాహః॥ * వహ ప్రాపణే॥ ఉపయమనం ఉపయమః - పరిణయనం పరిణయః॥ * ణీఞ్ ప్రాపణే। ఉద్వహనం ఉద్వాహః॥ * వహ ప్రాపణే॥ ఉపయమనం ఉపయామః॥ * యమ ఉపరమే। వివాహశబ్దము మొదలు ఈ ౫ శబ్దములకు పెండ్లియని యర్థము॥ ఉపసర్గవశమున నీ ధాతువిలన్ని యుని యర్థము నే చెప్పును॥ ౫॥ వరపాణినా వధూపాణేః పీడనం గ్రహణం పాణిపీడనం। వరుని హస్తము చేత వధూహస్తమును బట్టుట పాణిపీడనము॥ ౬॥ * వ్య

వ్యవాయో గ్రామ్యధర్మో మైథునం నిధువనం రతమ్।

వాయశబ్దము మొదలు ౫ స్త్రీసంగమము పేళ్లు॥ వ్యవాయనం వ్యవాయః॥ * ఇణ్ గతౌ। స్త్రీని పొందుట వ్యవాయము॥ గ్రామ్యాణాం పామరాణాం ధర్మో గ్రామ్యధర్మః॥ గ్రామ్యజనుల ధర్మము॥ ౨॥ మిథున స్యేదం మైథునం మిథునసంబంధమైనది ౩ నిధూయంతే అంగాన్యత్రేతి నిధువనం॥ * ధూఞ్ కంపనే। దీనియందు అంగములు కదలును॥ ౪॥ రమణం రతం॥ * రము క్రీడాయాం। రమించుట రతము ॥ ధర్మకా

త్రివర్గో ధర్మకామార్థైః చతుర్వర్గస్స మోక్షకైః॥ ౫౮ ॥ సబలైస్తైశ్చతుర్భద్రం జన్యాస్స్నిగ్ధా వరస్య యే।

మార్థములు మూఁడు త్రివర్గమనంబడును॥ త్రయాణాం వర్గః త్రివర్గః। ధర్మార్థకామములయొక్క సమూహము త్రివర్గము ॥ ౧ ॥ ** ఇదే మోక్షముతోఁ గూడినదై చతుర్వర్గమనంబడును॥ చతుర్ణాం వర్గః చతుర్వర్గః। ధర్మార్థకామమోక్షములనెడు నాలిగింటియొక్క సమూహము - చతుర్వర్గము॥౧॥ ** తుల్యబలములయిన యా ధర్మార్థకామమోక్షములు - చతుర్భద్రమనంబడును॥ చతుర్ణాం భద్రాణాం సమూహశ్చతుర్భద్రం। శుభస్వరూపములయిన నాలిగింటియొక్క కూటమి చతుర్భద్రము॥౧॥ ** పెండ్లికొడుకు చెలికాండ్రు జన్యులనంబడుదురు॥ జనీం వధూం వరం నయంతీతి జన్యాః॥ అ-పు॥ వరునికన్యను పొందించువారు జన్యులు॥౧॥ *

* ఇతి బ్రహ్మవర్గః. *

మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్రియో విరాట్॥ ౫౯ ॥

మూర్ధాభిషిక్తశబ్దము మొదలు ౫ క్షత్రియుని పేళ్లు॥ రాజ్యారోపణకాలే మూర్ధ్ని అభిషిక్తో మూర్ధాభిషిక్తః ప్రథమః క్షత్రియః - తత్ప్రభవతయా అనభిషిక్తా అపి మూర్ధాభిషిక్తాఖ్యాః - యథా బ్రహ్మా బాహుజస్య వంశ్యా బాహుజాస్తథైవేతి జ్ఞేయం। రాజ్యమునకు పట్టము గట్టునప్పుడు శిరస్సున నభిషేకము చేయబడు పట్టభద్రుడు మూర్ధాభిషిక్తుడు - ఇది - ఆవంశమందు బుట్టిన మూర్ధాభిషిక్తుడుగాని క్షత్రియమాత్రుని యందును వర్తించును - ఏ ప్రకారము గా బ్రహ్మ బాహుజుని వంశమందు బుట్టినవారు బాహుజులనంబడుదురో ఆలాగుననని తెలియదగినది॥౧॥ రాజ్ఞః క్షత్రియస్యాపత్యం పుమాన్ రాజన్యః॥ * జనీ ప్రాదుర్భావే। రాజుయొక్క అపత్యము రాజన్యుడు॥ ౨॥ బ్రహ్మణః బాహోర్జాతః బాహుజః। బ్రహ్మయొక్క బాహువులయందు బుట్టినవాఁడు॥ ౩॥ క్షతాత్త్రాయత ఇతి క్షత్రః - తస్యాపత్యం క్షత్రియః క్షతము వలన రక్షించువాఁడు గనుక క్షత్రుఁడు రాజు. వాని అపత్యము గనుక క్షత్రియుఁడు॥ ౪॥ విరాజతే విరాట్॥ జ-పు॥ రాజృ దీప్తౌ। విశేషముగా ప్రకాశించువాఁడు॥ ౫ ॥ రా

రాజ్ఞి రాట్ పార్థివక్ష్మాభృన్నృపభూపమహీక్షితః।

జన్శబ్దము మొదలు ౭ జనులను భూమిని నిరక్షించునట్టి క్షత్రియుని పేళ్లు॥ ఈ శబ్దము క్షత్రియుడుగాక అప్రయోజనమును చేయునట్టి మతియొకనియందును వర్తించును॥ ప్రజాః రంజయతీతి రాజా॥ న-పు॥ * రాజృ దీప్తౌ। ప్రజలను రంజింపఁజేయువాఁడు॥౧॥ రాజతే రాట్॥ జ-పు॥ ప్రకాశించువాఁడు॥ ౨॥ పృథివ్యా ఈశ్వరః పార్థివః భూమికి ప్రభువు॥ ౩ ॥ క్ష్మాం భువం బిభర్తీతి క్ష్మాభృత్॥ త-పు॥ * భృఞ్ భరణే। భూమిని భరించువాఁడు॥ ౪॥ నౄన్ పాతీతి నృపః॥ * పా రక్షణే । నరులను పాలించువాఁడు॥ ౫ ॥ భువం పాతీతి భూపః। భూమిని పాలించువాఁడు ॥ ౬ ॥ మహీం క్షియతి అధివసతి మహీక్షిత్॥

రాజా తు ప్రణతాశేష - త - పు ॥ * క్షి నివాసగత్యోః। భూమి నధివసించినవాఁడు ॥ ౭ ॥ ** సంసక్త స్సమంతాత్ సామంతస్స్యాదధీశ్వరః। అంతో యస్యాస్సా సామంతా స్వవిషయా దగ్గఱ రాభూమిః - సమంతాయా

శ్వరః॥౪౫౭॥

ఇమేసామంతాః। తనదేశముకొననుదగిలియుండెడుభూమిసమంత - దానికిరాజులయినవారు సామంతులు-అనఁగాతనదేశముచుట్టునుండురాజులు। నమస్కరింపబడినసామంతులుగలరాజు అధీశ్వరుఁడనంబడును॥ అధిసర్వసామంతానాముపరిఈష్టేఅధీశ్వరః॥ ఈశఐశ్వర్యే। సర్వసామంతులమీఁదనైశ్వర్యయుక్తుఁడైనవాఁడు॥౧॥

చక్రవర్తీ సార్వభౌమో

**చక్రవర్తి-సార్వభౌమశబ్దములుసమస్తమైనభూమినేలెడు రాజుపేళ్లు॥ చక్రంరాష్ట్రంస్వామిత్వేనవర్తయతీతిచక్రవర్తీ॥ న-పు॥* వృతువర్తనే। స్వామిత్వముచేతభూచక్రమునువర్తింపఁజేయువాఁడు॥౧॥ సర్వభూమేరీశ్వరః సార్వభౌమః। సమస్తమయినభూమికినీశ్వరుఁడు॥౨॥

నృపో౽న్యో మండలేశ్వరః।

** అన్యోనృపః-సార్వభౌమునికంటెనన్యుఁడయినకొంతభూమినేలెడువాఁడు-మండలేశ్వరుడనంబడును॥ మండలస్యేశ్వరో మండలేశ్వరః; భూమండలమునేలువాఁడు॥౧॥

యేనేష్టం రాజసూయేన మండలస్యేశ్వరశ్చ యః॥౪౫౮॥ శాస్తి యశ్చాజ్ఞయా రాజ్ఞః స సమ్రా

* యేనరాజ్ఞారాజసూయనామ్నాయాగేనఇష్టం, యోరాజామండలస్యహిమవత్సేతుమధ్యసహస్రయోజనపరిమాణస్యభూమండలస్యఈశ్వరః పాలయితా-యశ్చరాజ్ఞః హిమవత్సముద్రాభ్యంతరవర్తినోన్యాన్ శాస్తివిధేయీకరోతి- ఏతేత్రయస్సమ్రాట్ఛబ్దవాచ్యాఇతికేచిత్-పూర్వోక్తధర్మత్రయవిశిష్టఏకఏవరాజాసమ్రాడితికేచిత్। రాజసూయయాగముచేసినవాఁడును-హిమవత్సేతుమధ్యమందుగలసహస్రయోజనపరిమితమయినసకలభూమండలమునకునీశ్వరుఁడయినవాఁడును-హిమవత్సేతుమధ్యమందలిరాజులనుతనయాజ్ఞచేతస్వవశపఱచుకొనువాఁడును- ఈమూఁడువిధములవారునుసమ్రాట్టులనంబడుదురనికొందరు - ఈమూఁడువిధములుగలిగినయొకఁడేసమ్రాట్టనికొందరుయోజింతురు॥ క్షేత్ర్యదేవేషు -ఇహచఅతివిలక్షణతయారాజసుమధ్యేసమ్యక్ రాజతఇతిసమ్రాట్। జ-పు॥ రాజృదీప్తౌ। స్వర్గస్థుఁడయిదేవతలయందును-భూమినిరాజులయందునుతెస్సగాప్రకాశించువాఁడు॥౧॥

డథ రాజకం। రాజన్యకం చ నృపతిక్షత్రియాణాం గణే క్రమాత్॥

* రాజకరాజన్యశబ్దములువరుసగాప్రజలనేలెడురాజులసమూహమునకునుక్షత్రియజాతిమాత్రమువారిసమూహమునకును పేళ్లు॥ రాజ్ఞాంసమూహోరాజకం। రాజులయొక్కసమూహము॥౧॥ రాజన్యానాంసమూహోరాజన్యకం। రాజన్యులుక్షత్రియులు-వారియొక్కసమూహము॥౧॥

మంత్రీ ధీసచివో౽మాత్యో

** మంత్రిశబ్దముమొదలు౩ఆలోచనచెప్పెడుమంత్రిపేళ్లు॥ మంత్రోగుప్తవాదః-ఇతికర్తవ్యతావధారణంవా - సో౽స్యాస్తీతిమంత్రీ॥ న-పు॥ మంత్రమనఁగారహస్యవాదముగాని-ఇదిసేయఁదగినదియనునిశ్చయముగాని- అదిగలవాఁడు॥౧॥ ధియాసచతిసమవేతీతిధీసచివః॥ షచసమవాయే। బుద్ధితోఁగూడియుండువాఁడు॥౨॥ అమాశబ్దస్సహార్థేనిపాతః। అమామంత్రేణసహవర్తతఇతిఅమాత్యః। మంత్రముతోఁగూడియుండువాఁడు॥౩॥

౽న్యే కర్మసచివాస్తతః।

** తతోన్యే-అధీసచివునికంటెనన్యులైచిల్లరపనులయందు నియుక్తులయినవారుకర్మసచివులనంబడుదురు॥ కర్మసచంతీతికర్మసచివాః॥ అ-పు॥* షచసమవాయే। చిల్లరపనులయందుకూడుకొనియుండువారు॥౧॥

మహామాత్రాః ప్రధానాని

* మహామాత్రప్రధానశబ్దములు-ఉత్కృష్టులుహీనులుంగాకమధ్యమాధికారములయందువ్యవస్థితులయినదళవాయిమొదలయినవారిపేళ్లు॥ మహానతిమాత్రః పరిచ్ఛదః యేషాంతేమహామాత్రాః॥ అ-పు॥ అధికమయినసేనగలవారు॥౧॥ ప్రధంతేప్రధానాని *ప్రథప్రఖ్యానే। ప్రకృష్టముగాధరించువారు। రూపభేదముననపుంసకము॥ పుల్లింగముంగలదు॥ శ్లో॥ మహామాత్రః ప్రధానస్స్యాత్। అనిపుంస్కాండమందునో పాలితుఁడు॥౨॥

పురోధాస్తు పురోహితః॥౪౬౦॥

** పురోధః పురోహితశబ్దములుపురోహితునిపేళ్లు। శాంతికపౌష్టికాదికర్మసుపురోధీయతఇతిపురోధాః॥ స-పు॥ పురోహితశ్చ॥ *డుధాఞ్ ధారణపోషణయోః। శాంతికపౌష్టికాదిక్రియలయందుముందరనుంచఁబడువాఁడు॥౧॥౨॥

ద్రష్టరి వ్యవహారాణాం ప్రాడ్వివాకాక్షదర్శకౌ।

*ప్రాడ్వివాకఅక్షదర్శకశబ్దములుఋణాదానము-దాయము- మొదలైనవ్యవహారములనువిచారించుధర్మాధికారిపేళ్లు॥ ధర్మాధర్మౌపృచ్ఛతీతిప్రాట్-వివక్తీతివివాకః-ప్రాట్చాసౌవివాకశ్చప్రాడ్వివాకః॥ *ప్రచ్ఛజ్ఞీప్సాయాం॥ వచపరిభాషణే। వ్యవహారములనడిగివిచారించిపలుకువాఁడు॥౧॥ అక్షాన్ వ్యవహారాన్పశ్యతీతిఅక్షదర్శకః॥ *దృశిర్ ప్రేక్షణే। వ్యవహారములనుజూచువాఁడు॥ తదుక్తం। శ్లో॥ వివాదానుగతంపృష్ట్వాపూర్వవాక్యంప్ర

**ప్రతీహారో ద్వారపాలద్వాస్థద్వాస్థితదర్శకాః॥ ౮౬౧॥**

యత్నతః। విచారయతి యేనాసౌ ప్రాడ్వివాకస్తతస్స్మృతః ఇతి॥ ౨॥* ప్రతీహారాదిశబ్దములు ౫ వాకిలి కావలివాని పేళ్లు॥ ప్రతిహారతి నూతనజనాన్ ప్రతీహారః। నూతనజనులను పరిహరించువాఁడు *రాజ్ఞః ప్రతి అభిముఖ్యం జనాన్ హరతీతి వా ప్రతీహారః*హృఞ్ హరణే। రాజుల సమ్ముఖమునకు జనులను పొందించువాఁడు॥ పా॥ ప్రతిహారః॥౧॥ ద్వారం పాలయతీతి ద్వారపాలః* పాల రక్షణే। వాకిలిని గాచియుండువాఁడు॥౨॥ ద్వారి తిష్ఠతీతి ద్వాస్థః। ద్వాఃస్థితశ్చ*ష్ఠా గతినివృత్తౌ। ద్వారమందుండువాఁడు-ద్వాస్థుఁడు-ద్వాస్థితుఁడు॥౩॥౪॥ దర్శయతి జనాన్ దర్శకః। జనులను రాజునకు చూపించువాఁడు॥౫॥ వాకిట నున్న వారిని చూపించువాఁడు గనుక ద్వాస్థితదర్శకుఁడని యొకపేరుగా కొందరు చెప్పుదురు**

**రక్షివర్గస్త్వనీకస్థో**

రక్షివర్గానీకస్థశబ్దములు ౨ రక్షకుల సమూహము పేళ్లు॥ రక్షిణాం వర్గో రక్షివర్గః। రక్షకుల యొక్క సమూహము॥౧॥ అనీకేన బలేన తిష్ఠతీతి అనీకస్థః। మూఁకతోఁ గూడియుండువాఁడు॥౨॥

**థాధ్యక్షాధికృతౌ సమౌ।**

*అధ్యక్షాధికృతశబ్దములు సామాన్యముగ నెందయిననొక దానియందు అధికారము గలవాని పేళ్లు। అధ్యుపరి అక్ష్ణోతి అధ్యక్షః*అక్షూ వ్యాప్తౌ। అందరిమీదను వ్యాపించువాఁడు॥౧॥ అధిక్రియతే ఉపరి నియుజ్యతే స్మ అధికృతః*డుకృఞ్ కరణే। అందరిమీదఁ నియోగింపబడినవాఁడు*అధికారం కరోతీతి అధికృతః। అధికారముఁ జేయువాఁడు॥౨॥

**స్థాయుకోఽధికృతో గ్రామే**

** ఒక గ్రామమందు అధికారము గలవాఁడు స్థాయుకుఁడనంబడును॥ గ్రామే స్థాతుం శీలమస్యేతి స్థాయుకః। గ్రామమందుండు నట్టి స్వభావము గలవాఁడు॥౧॥

**గోపో గ్రామేషు భూరిషు॥ ౮౬౨॥**

* అనేక గ్రామములయందధికారము గలవాఁడు గోపుఁడనంబడును॥ గాం భూమిం పాతీతి గోపః*పా రక్షణే। భూమిని పాలించువాఁడు॥ ౧॥

**భౌరికః కనకాధ్యక్షో**

** బంగారమునందు అధికారము గలవాఁడు భౌరికుఁడనంబడును॥ భూరి సువర్ణం పాలయతీతి భౌరికః। భూరి యననఁగా సువర్ణము-దానిఁ బాలించువాఁడు॥ భూరి ప్రాజ్యసువర్ణయో రితి ధరణిః॥౧॥

**రూప్యాధ్యక్షస్తు నైష్కికః।**

* రూప్యాధ్యక్షః-టంకసాలకు అధికారి-నైష్కికుఁడనంబడును॥ ప్రశస్తం రూపమత్రేతి రూప్యం తస్య అధ్యక్షో రూప్యాధ్యక్షః। రూప్యమనఁగా టంకము-అందుకు అధికారి॥ నిష్కో నామ రజతం తస్యాధికారిత్వాత్ నైష్కికః। నిష్కమనగా వెండి-దానికి అధికారి నైష్కికుఁడు॥౧॥

**అంతఃపురే త్వధికృతస్స్యాదంతర్వంశికో జనః॥ ౮౬౩॥**

* అంతఃపురమునకు అధికారియైన జనుఁడు-అంతర్వంశికుఁడనంబడును॥ వంశస్య కులస్య అంతర్వర్తతే అంతర్వంశాః కులస్త్రీ-స్సైవ విధేయత్వేనాస్త్యస్యేతి అంతర్వంశికః। వంశము నతిక్రమించక యుండునది గనుక అంతర్వంశ యనఁగా రాణివాసము గల స్త్రీ-అది తనకు విధేయురాలుగాఁ గలవాఁడు॥

**సౌవిదల్లాః కంచుకినస్స్థాపత్యాస్సౌవిదాశ్చ తే।**

** సౌవిదల్లశబ్దము మొదలుకు అంతఃపుర పుకావలివారల పేళ్లు॥ సుష్ఠు వేత్తీతి సువిత్ రసికః-తం లాంతి వల్లభత్వేన స్వీకుర్వంతీతి సువిదల్లాః స్త్రియః-తాః పాలయంతీతి సౌవిదల్లాః। లెస్సఁగా నెఱిఁగిన వాని తమకు నాయకునిఁగా స్వీకరించువారు గనుక సువిదల్లలనఁగా స్త్రీలు వారిని కాచుకొనియుండువారు సౌవిదల్లులు॥౧॥ కంచుకాస్సంతి వినీతవేషార్థం యేషామితి కంచుకినః॥ న-పు॥ వినీతవేషార్థమయి బుసము గలవారు॥౨॥ స్త్రీణాం వ్యవస్థాం స్థాపయంతీతి స్థాపత్యాః। స్త్రీల వ్యవస్థను నిలుపువారు॥౩॥ సుష్ఠు విదంతీతి సువిదః ప్రగల్భాః స్త్రియః తాః రక్షంతీతి సౌవిదాః। లెస్సగా నెఱుంగువారు గనుక సువిదలనఁగా ప్రౌఢస్త్రీలు వారిని గాచువారు॥౪॥

**షండో వర్షవరస్తుల్యౌ**

**షండవర్షవరశబ్దములు అంతఃపురపాలకులయిన యెగ్గళ్ల పేళ్లు॥ ఎగ్గళ్లనఁగా వృషణహీనులు గాని-అన్యులు గాని స్త్రీస్వభావము గలవారు। షండవ్యుత్పత్తి చెప్పబడెను॥ వర్షం రేతస్సేకం వృణోతీతి వర్షవరః*వృఞ్ వరణే। రేతస్సేకము నాచ్ఛాదించువాడు॥ పా॥ వర్షాణి వృథా ధరతి వర్షధరః। వ్యర్థముగా సంవత్సరముల ధరించువాడు॥ తదుక్తం॥ శ్లో॥ యే త్వల్పసత్త్వాః ప్రఖలాః క్లీబాశ్చ స్త్రీస్వభావినః। నదృష్టాః క్వాపి కార్యేషు తే నైవ వర్షధరాస్స్మృతా ఇతి॥ ౨॥

**సేవకార్థ్యనుజీవినః॥ ౮౬౪॥**

* సేవకశబ్దము మొదలు ౩ కొలుచువాని పేళ్లు॥ సేవతే సేవకః॥*షేవృ సేవనే। సేవించువాఁడు॥౧॥ అర్థనమర్థః-సోఽస్త్యస్యేతి అర్థీ। న-పు। అడుగుట గలవాఁడు॥౧॥ ప్రభుమనుసృత్య జీవతీతి అనుజీవీ॥ న-పు॥ ప్రభువనుసరించి బ్రతుకువాఁడు॥ ౩ ॥

**విషయానంతరో రాజా శత్రుర్మిత్రమ**

** సమంతతః మండలీభూతస్యాస్య దేశస్య భూమ్యనంతరో రాజా శత్రుః- ఏకార్థాభినివేశాత్ । తతః పరం భూమ్యేకాంతరితో

**తతః పరం ఉదాసీనః పరతరః**

రాజా మిత్రం-ఉపకారిత్వాత్। శత్రు దేశాత్పరతః స్థితః బలాధికో యో రాజా ఉపకారాపకారాసకరో ఽతిస ఉదాసీనః। ఒక రాజునకు తన దేశమునకంటె నావలదేశమునందుండెడు రాజు శత్రువు। సదా బాధయొనర్చువాఁడు। ఆశత్రుదేశమునకంటె నావలిదేశమందుండు రాజు సహాయము చేయువాఁడుగనుక మిత్రుఁడు। ఆమిత్రుని దేశమునకంటె నావలి దేశమునందుండు రాజు ఉపకారాపకారములు చేయనివాఁడౌటవలన నుదాసీనుఁడు॥ శాదయతీతి శత్రుః। ఉ-పు। శద్ల్ శాతనే। పీడించువాఁడు॥౧॥ మేదతె స్నిహ్యతీతి మిత్రం॥ ఞిమిదా స్నేహనే। స్నేహయుక్తుఁడైనవాఁడు॥౧॥ ఊర్ధ్వమాస్తే ఽస్థతీతి ఉదాసీనః శత్రుమిత్రదేశములకుమీద నుపకారాపకారములు చేయక యూరకుండువాఁడు॥

**పార్ష్ణిగ్రాహస్తు పృష్ఠతః॥౭౮॥**

శత్రుమభియాంజానస్య శత్రుహాననాయ విజిగీషో రాజ్ఞః పార్ష్ణిం పృష్ఠభాగం యో గృహ్ణాతి-స పార్ష్ణిగ్రాహః। ఒక్క-దిక్కు-నకు గెలువబోవు రాజునకు వెనుకనుండెడు శత్రువు పార్ష్ణిగ్రాహుఁడనంబడును। పార్ష్ణిం గృహ్ణాతి పృష్ఠత స్తిష్ఠతీతి పార్ష్ణిగ్రాహః॥ గ్రహ ఉపాదానే। వెనుకదిక్కు-న మడమ ద్రొక్కు-చునుండువాఁడు॥ శ్లో॥ సంపన్నస్తు ప్రకృతిభిర్మహోత్సాహః కృతశ్రమః। శత్రుశిక్షణశీలశ్చ విజిగీషురితిస్మృత ఇతి విజిగీషులక్షణం॥

**రిపౌ వైరిసపత్నారి ద్విషద్ద్వేషణదుర్హృదః। ద్విడ్విపక్షాహితామిత్రదస్యుశాత్రవశత్రవః॥౭౯॥ అభియాతిపరారాతి ప్రత్యర్థిపరిపంథినః। భ్రాతృవ్యాసహనద్వేషిజిఘాంసు ప్రత్యనీకినః। అనుహాత్ప్రత్యవస్థాతృప్రతి పక్షవిరోధినః**

**రిపుశబ్దము మొదలుగా శత్రువు పేళ్లు। రపత్యపకీర్తిం రిపుః ఉ-పు। రపలవ వ్యక్తాయాం వాచి। అపకీర్తిని పలుకువాఁడు॥ రేవయతీతి వా రిపుః॥ రెవృగతౌ। మూకను గూర్చుకొనివచ్చువాఁడు॥౧॥ వైరమస్యాస్తీతి వైరీ॥ న-పు॥ వైరముగలవాఁడు॥౨॥ సపత్నవద్దుఃఖహేతుత్వాత్ సపత్నః। సవతివలె దుఃఖహేతువైనవాఁడు। సమానపతిత్వాద్వా సపత్నః। సమానపతిత్వముగలవాఁడు॥౩॥ ఇయర్తి అరిః॥ ఇ-పు॥ ఋగతౌ। యుద్ధార్థమై వచ్చువాఁడు॥౪॥ ద్వేష్టీతి ద్విషత్। త-పు॥ ద్వేషణం చ। ద్విష అప్రీతౌ। ద్వేషించువాఁడు-ద్విషత్తు। ద్వేషణుఁడును॥౫॥౬॥ దుష్టం హృదయమస్యేతి దుర్హృత్॥ ద-పు॥ దుష్టమైన హృదయముగలవాఁడు॥౭॥ ద్వేష్టీ ద్విట్॥ష-పు॥ ద్వేషించువాఁడు॥౮॥ విరుద్ధః పక్షో ఽస్యేతి విపక్షః। విరుద్ధమైన పక్షముగలవాఁడు॥౯॥ న-హితః అహితః। హితుఁడుగానివాఁడు॥ ౧౦ నమిత్రం అమిత్రః-మిత్రుఁడుగానివాఁడు॥౧౧॥ దస్యతి ఉపక్షయం కరోతీతి దస్యుః॥ ఉ-పు॥ దసు ఉపక్షయే। ఉపక్షయము చేయువాఁడు॥౧౨॥ శాదయతీతి శత్రుః॥ ఉ-పు॥ శత్రురేవ శాత్రవః॥ శద్ల్ శాతనే। కృశముగాఁజేయువాఁడు శత్రువు-శత్రువే శాత్రవుఁడు॥౧౩॥౧౪॥ అభిఅభిముఖం యాతీతి అభియాతిః॥ ఇ-పు॥ యా ప్రాపణే। అభిముఖమై వచ్చువాఁడు॥ పా॥ అభిమన్యతె శత్రురిత్యేవ అభిమానీ॥ న-పు॥ మన జ్ఞానే। శత్రువని తలఁచబడువాఁడు॥ పా॥ అభిముఖం హంతీతి అభిఘాతీ॥ న-పు॥ అభిముఖముగాఁ జంపువాఁడు॥౧౫॥ ప్రియా తె హంతుమితి పరః॥ పృఙ్ వ్యాయామే। హింసించుకొఱకు తిరుగువాఁడు॥౧౬॥ ఇయర్తి అరాతిః॥ ఇ-పు॥ ఋగతౌ॥ సంహరించువాఁడు॥౧౭॥ ప్రతికూలమర్థయతె ప్రత్యర్థీ॥ న-పు॥ ప్రతికూలముగాఁ గోరెడువాఁడు॥౧౮॥ పరిపంథయతీతి పరిపంథీ॥ న-పు॥ బంధించువాఁడు॥౧౯॥

**స్నిగ్ధో వయస్యస్సవయాః**

స్నిగ్ధశబ్దము మొదలు ౩ సమానవయస్సుగల చెలికాని పేళ్లు॥ స్నిహ్యతీతి స్నిగ్ధః॥ ష్ణిహ ప్రీతౌ। స్నేహించువాఁడు॥౧॥ వయసా తుల్యో వయస్యః। వయస్సుచేత సమానుఁడైనవాఁడు॥౨॥ సమానం వయో యస్య సః సవయాః॥ స-పు। సరియైన వయస్సుగలవాఁడు॥౩॥

**అథ మిత్రం సఖా సుహృత్॥౮౦॥**

మిత్రశబ్దము మొదలు ౩ స్వభావమున స్నేహితుఁడైనవాని పేళ్లు॥ మేదతే మిత్రం॥ ఞిమిదా స్నేహనే। స్నేహించువాఁడు॥౧॥ సమానః ఖ్యాతః సఖా। ఇ-పు॥ ఖ్యా ప్రకథనే। సమానముగాఁ బలుకఁబడినవాఁడు॥౨॥ శోభనం హృదయమస్యేతి సుహృత్॥ ద-పు॥ మంచిహృదయముగలవాఁడు॥౩॥

**సఖ్యం సాప్తపదీనం స్యాత్**

సఖ్యసాప్తపదీనశబ్దములు చెలిమి పేళ్లు॥ సఖ్యుః భావః సఖ్యం। సఖునియొక్క భావము సఖ్యము॥౧॥ సప్తభిః పదైః ప్రాప్యతే ఇతి సాప్తపదీనం ఏడడుగులచేతఁ బొందఁబడునది॥౨॥

**అనురోధో ఽనువర్తనం**

అనురోధానువర్తనశబ్దములు అనుకూలించుట పేళ్లు॥ అనురోధనం అనురోధః॥ రుధిర్ ఆవరణే। అనుకూలముగా తిరుగుట॥౧॥ అనుకూలం వర్తనం అనువర్తనం॥ వృతు వర్తనే। అనుకూలముగా వర్తించుట॥౨॥

**యథార్హవర్ణః ప్రణిధిరపసర్పశ్చరస్స్పశః**

యథార్హవర్ణశబ్దము మొదలు ౭ వేగులవాని పేళ్లు। మొదటి రెండుశబ్దములు వణిక్పాపకీవలభిక్షు కాదిరూపములనుండెడువాఁ

**శ॥౪౬౮॥ చారశ్చ గూఢపురుష**

రుని పేళ్లనికొందరందురు॥ యథార్హోయోగ్యోవర్ణః ప్రకారోస్యాస్తీతి యథార్హవర్ణః॥ యే నప్రకారేణ పరచక్రం జ్ఞాతుం శక్నోతి తత్ప్రకారవానిత్యర్థః। ఏ ప్రకారమున పరచక్రమెఱుఁగన హర్హమౌనో అటువంటి ప్రకారము గలవాఁడు॥౧॥ ప్రకర్షేణ నిధీయతే జ్ఞేయమస్మిన్నితి ప్రణిధిః॥ ఇ-పు॥ *డుధాఞ్ ధారణపోషణయోః। ఎఱుఁగదగిన వస్తువు వీనియందు ధరింపఁబడును॥౨॥ అపకృష్టం సర్పతీత్యపసర్పః *సృప్ ల్ గతౌ। ప్రచ్ఛన్నుఁడు తిరుగువాఁడు॥౩॥ చరతీతి చరః *చర గతౌ। చరించువాఁడు॥౪॥ స్పశతి బాధతే పరానితి స్పశః- తాలవ్యాంతో రేఫశూన్యశ్చ * స్పశ బాధనస్పర్శనయోః। పరులను బాధించువాఁడు॥౫॥ చరతి జానాతి పరబలమితి చారః *చర గతౌ-గత్యర్థత్వాత్ జ్ఞానార్థత్వం। పరబలము నెఱిఁగినవాఁడు॥౬॥ గూఢశ్చాసౌ పురుషశ్చ గూఢపురుషః। గూఢమైన పురుషుఁడు॥౭॥

**శ్చాప్తప్రత్యయితౌ సమౌ।**

*ఆప్త ప్రత్యయిత శబ్దములు ఆప్తుని పేళ్లు॥ ఆప్నోతి రహస్యమిత్యాప్తః *ఆప్ ల్ వ్యాప్తౌ। రహస్యమును బొందువాఁడు॥౧॥ ప్రత్యయో విశ్వాసోస్య సంజాతః ప్రత్యయితః। విశ్వాసము - ఇతనియందు పుట్టును॥౨॥

**సాంవత్సరో జ్యౌతిషికో దైవజ్ఞగణకావపి॥౪౬౯॥ స్యుర్మౌహూర్తికమౌహూర్తజ్ఞానికార్తాంతికా అపి।**

**సాంవత్సర శబ్దము మొదలు ౮ జ్యోస్యుని పేళ్లు॥ సంవత్సరం కాలం వేత్తీతి సాంవత్సరః। కాలము నెఱిఁగినవాఁడు॥౧॥ జ్యోతీంషి నక్షత్రాణ్యధికృత్య కృతో గ్రంథో జ్యోతిషం-తద్వేత్తీతి జ్యౌతిషికః। జ్యోతిస్సులనఁగా నక్షత్రములు- వానినధికరించి చేయఁబడిన గ్రంథము జ్యోతిషము-దాని నెఱిఁగినవాఁడు। ఔ కారాది॥౨॥ దైవం శుభాశుభం జానాతీతి దైవజ్ఞః * జ్ఞా అవబోధనే। దైవమనఁగా శుభాశుభములు- దాని నెఱిఁగినవాఁడు॥౩॥ గణయతి కాలం గణకః * గణ సంఖ్యానే। కాలమును లెక్కపెట్టువాఁడు॥౪॥ ముహూర్తం కాలం వేత్తీతి మౌహూర్తికో మౌహూర్తశ్చ। ముహూర్తము నెఱిఁగినవాఁడు॥౫।౬॥ జ్ఞానమస్యాస్తీతి జ్ఞానీ॥న-పు॥ కాలజ్ఞానము గలవాఁడు॥౭॥ కృతాంతో దైవం-తద్వేత్తీతి కార్తాంతికః। కృతాంతమనఁగా దైవము- దాని నెఱిఁగినవాఁడు॥౮॥

**తాంత్రికో జ్ఞాతసిద్ధాంత**

తాంత్రిక జ్ఞాతసిద్ధాంత శబ్దములు-ఏదైన నొక శాస్త్రతత్త్వము నెఱిఁగినవాని పేళ్లు॥ తన్యతే అనేన మతధర్మ ఇతి తంత్రం-తద్వేద-తాంత్రికః। దీని చేత మతధర్మము విస్తరింపఁబడును గనుక తంత్రము-తంత్రము నెఱిఁగినవాఁడు తాంత్రికుఁడు॥౧॥ జ్ఞాతసిద్ధాంతో నేనేతి జ్ఞాతసిద్ధాంతః। ఎఱుఁగఁబడిన సిద్ధాంతము గలవాఁడు॥౨॥

**స్సత్రీ గృహపతిస్సమౌ॥౪౭౦॥**

**సత్రి గృహపతి శబ్దములు సదాదానము చేయువాని పేళ్లు. సత్రం సదాదానమస్యాస్తీతి సత్రీ॥న-పు॥ సత్రమనఁగా సదాదానము-అది గలిగినవాఁడు॥ శ్లో॥ సత్రం యజ్ఞే సదాదానే ఛాదనారణ్యయోరపి-అ ధరణి॥౧॥ గృహస్య పతిః గృహపతిః। గృహమునకు ప్రభువు॥౨॥

**లిపికారోక్షరచణోక్షరచుంచుశ్చ లేఖకే లిఖితాక్షరసంస్థానే లిపిర్లిబిరుభే స్త్రియౌ॥౪౭౧॥**

**లిపికార శబ్దము మొదలు ౪ లేఖకుని పేళ్లు॥ లేఖరి॥ లిపిం కరోతీతి లిపికారః। లిపిని జేయువాఁడు॥ పా॥ లిపికరః॥౧॥ అక్షరైః విత్తః అక్షరచణః అక్షరచుంచుశ్చ। అక్షరముల చేత ప్రసిద్ధుఁడు॥౨।౩॥ లిఖతీతి లేఖకః *లిఖ అక్షరవిన్యాసే। వ్రాయువాఁడు॥౪॥ **లిపి లిభి శబ్దములు పుస్తకములయందు వ్రాయఁబడిన అక్షరముల యొక్క ఆకారము పేళ్లు॥ ఇచ్చట లిఖితం అక్షరసంస్థానం అని విభాగించి-ఈ ౨ శబ్దములు లిపికే పేళ్లనికొందరు। లిఖితాక్షరవిన్యాసే అను పాఠమందు లిఖితా-లిపిః-లిభిః-ఈ ౩ను వ్రాత పేళ్లు॥ లిప్యతే నయా పత్రం లిపిః-లిభిశ్చ॥ఇ-స్త్రీ॥ లిప ఉపదేహే। దీని చేత పత్రము పూయఁబడును గనుక-లిపి॥ పా॥ లిపీ-లిభీ॥ ఈ-స్త్రీ॥౧।౨॥

**స్యాత్సందేశహరో దూతో దూత్యం తద్భావకర్మణోః।**

** సందేశ దూత శబ్దములు దూత పేళ్లు॥ సందేశం హరతీతి సందేశహరః। సందేశమనఁగా నోటి మాట- దానిని- గ్రహించువాఁడు॥౧॥ దూయతే నేన పర ఇతి దూతః * దూఞ్ పరితాపే। వీని చేత శత్రువు తపింపఁజేయఁబడును॥౨॥ ** దూత యొక్క భావము-కర్మమును-దూత్యమనంబడును॥ దూతస్య భావః కర్మ వా దూత్యం। దూత యొక్క భావము - క్రియయును-దూత్యము॥ పా॥ దౌత్యం॥

**అధ్వనీనోధ్వగోధ్వన్యః పాంథః పథిక ఇత్యపి॥౪౭౨॥**

**అధ్వనీన శబ్దము మొదలు ౫ తెరువరి పేళ్లు। త్రోవ నడుచువాఁడు। అధ్వానం గచ్ఛతీత్యధ్వనీనః। అధ్వగః। అధ్వన్యశ్చ। పంథానం గచ్ఛతీతి పాంథః। పథికశ్చ। త్రోవ నడుచువాఁడు-అధ్వనీనుఁడు। అధ్వగుఁడు। అధ్వన్యుఁడు। పాంథుఁడు। పథికుఁడును॥౧।౨।౩।౪।౫॥

**స్వామ్యమాత్యసు**

** స్వామ్యాది శబ్దములు ౭ రాజ్యాంగములనంబడును। ఈ సప్తాంగములే ప్రకృతులనంబడును॥ పౌ

హృత్కోశరాష్ట్ర దుర్గబలానిచ। రాజ్యాంగాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోఽపిచ॥౮౭౩॥

రశ్రేణులును ప్రకృతులనంబడుదురు॥శ్లో॥ అమాత్యాశ్చైవ పౌరాశ్చసద్భిః ప్రకృతయస్స్మృతాః అనికార్యుఁడు।స్వామియనగా రాజు।అమాత్యుడు మంత్రి।సుహృత్తు చెలికాఁడు।కోశము భండారము।రాష్ట్రము- దేశములతోఁగూడినపట్టణము। దుర్గము పర్వతాదికవృక్షములచేతపోవశక్యము గానిపట్టణము।బలము సైన్యము॥ఒకఁడు ముఖ్యుఁడుగాగలవాడును- సజాతీయులును నైనపురజనుల సమూహములు పౌరశ్రేణులు॥స్వం విద్యతే అస్యేతి స్వామీ॥న-పు॥ ధనముగలవాఁడు ॥౧॥ అమాస మీపేభవః అమాత్యః। సమీపమందుండువాడు॥౧॥శోభనం హృదయమస్యేతి సుహృత్॥ద-పు॥మం చిహృదయముగలవాఁడు॥౧॥కూయతె ఉత్కృష్టఇతి కోశః॥కుశబ్దే॥ ఉత్కృష్టమనిపలుకఁబడునది। కోవమనిమూర్ధన్యాంతముగా కొందరు పలుకుదురు॥౧॥ రాజత ఇతి రాష్ట్రం।ప్రకాశించునది॥ ౧॥ దుఃఖేన గమ్యత ఇతి దుర్గం।ప్రయాసముచేతపొందఁబడునది॥౧॥ బలంత్యనేనబలం॥బలప్రాణనే। దీనిచేత బ్రతుకుదురు॥౧॥ప్రక్రియంతె రాజ్యమాభిరితి ప్రకృతయః॥ఇ-సీ॥ వీనిచేత రాజ్యము ప్రకృష్ట ముగాఁజేయఁబడును॥౧॥శ్రయంతె పరస్పరమితి శ్రేణయః॥ఇ-సీ॥శ్రిఞ్ సేవాయాం। పౌరాణాం శ్రేణయః పౌరశ్రేణయః।పరస్పరము ఆశ్రయించునవి గనుక శ్రేణులు - పౌరులయొక్క శ్రేణులు పౌరశ్రేణులు॥రాజ్యమునకు ఉపకారికములైన సంధ్యాదులు షడ్గుణములనంబడును॥

సంధిర్నా విగ్రహో యానమాసనం ద్వైధమాశ్రయః।షడ్గుణాః

సంధానమేకత్వం సంధిః।ఒకటౌటసంధి- అనగా శత్రువుతోఁజేరుట॥ఆసంధికోశప్రధానహేతుకము- దండప్రధానహేతుకము-భూమిప్రధానహేతుకము- అని మూడువిధములు॥శత్రుమండలమందు ఆహవోపాధిరూపమైన అపకారము విగ్రహమనంబడును॥అది,ప్రకాశయుద్ధము-కూటయుద్ధము-తూష్ణీం యుద్ధము - అని మూడు విధములు ॥ స్వశక్త్యాధిక్యము గలప్పుడుగాని పరునికివ్యసనముగలప్పుడు గాని పరుని గెలువవలయుననునిచ్ఛచేత కదలిపోవుట యానమనంబడును -అది - విగృహ్యయానము-సంధాయయానము - సంభూయయానము-ప్రసంగయానము- ఉపేక్ష్యయానము అని అయిదువిధములు॥ పరుని కేవలము సంహరించవలయునని కదలిపోవుట విగృహ్యయానము। పరుని తనవశము జేసుకొని ధనదుర్గాదుల గ్రహించవలయునని పోవుట సంధాయయానము-తనకుశత్రువు గెలువశక్యము గానివాఁడై యున్నప్పుడు తనకు సమానమైన రాజులను గూర్చుకొని కదలిపోవుట సంభూయయానము।ఒకదిక్కునకు కదలిపోవలసియుండగా ప్రసంగమున- మఱియొకదిక్కునకు కదలిపోవుట - ప్రసంగయానము । పరుని నేను సంహరించగలను-నన్ను పరుఁడు గెలువలేడను బుద్ధిచేత లేశకాలాదులను జూడక కదలిపోవుట ఉపేక్ష్యయానము॥ దేశకాలాద్యపేక్షచేత దుర్గాదులను భరియించుకొని ప్రయాణపరాఙ్ముఖుఁడై యుండుట ఆసనము -అదియును పటివలె విగృహ్యాసనాదిరూపమున-అయిదువిధములు తనమీద నిద్దరు శత్రువులు దండెత్తివచ్చినపుడొకనితో సంధిచేసి యొకనితో విరోధపడుట ద్వైధము-బలవంతులైనయిద్దరు శత్రువులలో నొకనికిఁ దెలియక యొకనితో మంచిమాటలాడుచుండుటయైనను- ద్వైధము॥శ్లో॥బలినోర్ద్విషతోర్మధ్యే వాచాత్మానం సమర్పయేత్।ద్వైధీభావేనవర్తేత కాకాక్షివదలక్షితః।అనిమనువు అశక్తిచేత బలవంతుని ఆశ్రయించుట ఆశ్రయము బలవంతుఁడైన శత్రువునుధనప్రదానాదులచేత ఆశ్రయించుటయైనను ఆశ్రయము॥

శక్తయస్తిస్రః ప్రభావోత్సాహమంత్రజాః॥౮౭౪॥

ప్రభావమువలనను-ఉత్సాహమువలనను-మంత్రమువలనను బుట్టినవి మూడుశక్తులనంబడును॥శక్యంతే జేతుం శత్రవోఽభిరితి శక్తయః॥ఇ-సీ॥శక్ల్ శక్తౌ। వీనిచేత శత్రువు గెలువబడుదురుగనుక- శక్తులు॥కోశదండాదులవలన వచ్చినబలము ప్రభావశక్తి।అత్యధికమైన విక్రమచేష్ట ఉత్సాహశక్తి।సంధివిగ్రహాదులను సామాదులను యథార్హముగా ప్రయోగించుటయొక్క మంత్రశక్తి॥

క్షయః స్థానంచ వృద్ధిశ్చ త్రివర్గో నీతివేదినామ్।

క్షయశబ్దము మొదలు మూడు నీతివేదులకు త్రివర్గమనంబడును,ఇతరులకు ధర్మార్థకామములు త్రివర్గము॥శత్రువ్యాపారాధిక్యము నిమిత్తముగాగల ఆత్మాపచయము క్షయము॥స్వోపచయనిమిత్తమైన పరాపచయము వృద్ధి। ఈ రెంటియొక్క సామ్యము స్థానము॥శ్లో॥పరకర్మోదయే నేతుః క్షయో వృద్ధిర్విపర్యయే।తుల్యేకర్మఫలే స్థానం కర్మసు జ్ఞేయమాత్మన ఇతి॥కృషిర్వణిక్పథో దుర్గం సేతుః కుంజరబంధనం।ఖన్యాకరవిధానంచ శూన్యానాంచ నివేదనం-అని-యీయష్టవర్గులయొక్క అపచయోపచయసామ్యములవలన క్షయాదిత్రివర్గము గలుగును॥

సప్రతాపః ప్రభావశ్చ యత్తేజః

భండారములవలనను- దండుగలవలనను గలిగినతేజస్సు-ప్రతాపము ప్రభావము అనంబడును॥ప్రతపంత్యనేన శత్రూనితి ప్రతాపః

...కోశదండజ మ్॥ ౨౭౫॥

*తపసంతాపే దీనిచేత శత్రువులను తపింపఁజేయుదురు ॥౧॥ ప్రభవంత్యనేన శాసితుం జగదితి ప్రభావః దీనిచేత జగత్తు నేలుటకు సమర్థులగుదురు॥ *

సామదానే భేద దండావిత్యు పాయాశ్చతుష్ట యం।

సామశబ్దము మొదలుగల ఉపాయములనంబడును॥ ఉపైతి వాంఛితమనేనేత్యుపాయః*ఇణ్ గతౌ। దీనిచేత వాంఛితమును పొందుదురు ౧ అనుకూలముగా వర్ణించుట సామము-అది. పరస్పరోపకారముగమభింపజేయుటయు మంచితనము చేయుటయు గుణములను గొనియాడుటయు-చుట్టరికము నెఱుంగజేయుటయు నేను నీవాఁడననిమంచిమాటలాడుటయు నని యైదువిధములు॥ దానము సగానిచ్చుట-అది తనకుఁగలధనమంతయు సమర్పించుటయు-ఎక్కుడనైనధనము తీసుకొన్నవాఁడు లనందునను దూలుఁడైసంతోషించుటయు-అపూర్వములైనవస్తువులనిచ్చుటయు-వీఁడుధనమువుచ్చుకొనునుమదనీసొమ్మునీయుఁడని సొమ్మునీదతానే ప్రవర్తింపజేయుటయు-ఋణప్రమోచనంబును-అనియైదువిధములు॥ తనమీదయుద్ధకు శత్రువులు గూడివచ్చినపుడు-ఒకనొకని వేరుపరచుట భేదము॥ అది ఒకనొకని స్నేహము చెరుచుటయు- పరస్పరము సంఘర్షణము పుట్టించుటయు సంతర్జనము-అని మూడువిధములు॥ శ్లో॥ స్నేహరాగాపనయనం సంఘర్షోత్పాదనం తథా। సంతర్జనంచ భేదజ్ఞైర్భేదస్తు త్రివిధస్మృతః-అని॥ పీడించుట దండము-అది-చంపుట-ధనము నుహరించుట. బాధపెట్టుట-అని మూడువిధములు॥ శ్లో॥ వధోర్థహరణం చైవ పరిక్లేశ స్తథైవచ-అని॥ శ్లో॥ సామదానంచ భేదశ్చదండశ్చేతి చతుష్టయం। మాయోపేక్షేంద్రజాలంచ సప్తోపాయాః ప్రకీర్తితాః॥ అనికొందరిమతమున సప్తోపాయములుగలిగినను మాయోపేక్షలకు దండమందును-ఇంద్రజాలమునకు భేదమందును-అంతర్భావముగనుక ప్రత్యేకముగా చెప్పబడనివయ్యె**

సాహసంతు దమోదండ

నామమాత్రమున సామాన్యముగా చెప్పబడినయీశబ్దములకు ప్రత్యేకముగా పర్యాయముల జెప్పుచున్నాఁడు। సాహసశబ్దము మొదలు ౩ దండోపాయము పేళ్లు। సహో బలం తత్ర భవం సాహసం। సహస్సనగా బలము-అందుబుట్టినది ౧ దమనందము॥ దండశ్చ। శిక్షించుట దమము దండము॥ ౨॥ ౩॥** సామ

స్సామసాంత్వ

సాంత్వశబ్దములు సామోపాయము పేళ్లు॥ స్యతి వైరం సామ॥ న-న॥ *షోంతకర్మణి॥ వైరమునుజెఱుచునది ౧ సాంత్వయంత్యనేన సాంత్వం*సాంత్వ సామప్రయోగే. దీనిచేత నూరడింతురు॥ ౨॥**

మథోసమౌ॥ ౨౭౬॥ భేదోప

భేదోపజాపశబ్దములు భేదోపాయము పేళ్లు॥ సంహతయోర్భేదనం భేదః*భిదిర్ విదారణే। కూడియున్నవారినెడబాపుట భేదము ౧ ఉపాంశుజపనం ఉపజాపః*జపవ్యక్తాయాం వాచి। మెల్లగాపలు

జాపా*వుపధా ధర్మాద్యైర్య త్పరీక్షణం *పం

కుట-ఉపజాపము ౨*ధర్మార్థకామ భేదముల చేతను-ఆమాత్యులు మొదలయినజనులను రాజుపరీక్షించుట-ఉపధయనంబడును। ఉపధీయత ఇత్యుపధా*డుధాఞ్ ధారణపోషణయోః। దీనిచేత నెఱుఁగఁబడును॥ ౧॥** ఈముందర చెప్పఁబడెడు-అపడక్షీణ-వివిక్త-విజన-ఛన్న - నిశ్శలాకశబ్దములు ౫

చత్రి*ష్వపడక్షీ ణో యస్మృతీ యాద్యగోచరః।

మూఁడులింగములయందును వర్తించును * మూఁడవవానికి దెలియరాకయుండ దాఁచుకొనునట్టి యేకాంతము-అపడక్షీణమనంబడును॥ నవిద్యంతే షడక్షీణియస్మిన్నితి అపడక్షీణః। దీనియందు ఆరుకన్నులు లేవు*షడక్షాణి(శ్రోత్రాదీంద్రియాణి)నవిద్యంతేఽస్మిన్నితి అపడక్షీణః॥ ఆరేసి చెవులుగాని ఇతరేంద్రియములుగాని దీనియందు లేవుగనుక అపడక్షీణము॥ ౧॥ *వివిక్తశబ్దము మొదలు ౩ ఏకాంతమునకు అహమయిన విజనస్థలము పేళ్లు॥ వివిచ్యతే పృథక్ క్రియతే వివిక్తః*విచిర్ పృథగ్భావే। సర్పఱచఁబడునది॥

వివిక్తవిజనచ్ఛన్న నిశ్శలాకా స్తథా రహః। రహశ్చో పాంశుచాలింగే

౧ విగతో జనోఽస్మాదితి విజనః। జనులు లేనిది॥ ౨॥ ఛాద్యతే గోప్యతే ఛన్నః*ఛద అపవారణే। గుప్తముచేయఁబడునది ౩ నిర్గతాశ్శలాకా శ్శాలికా అస్మిన్నితి నిశ్శలాకః। శలాకములనఁగా గోరవంకలు అవిగూడ లేనిది॥ శ్లో॥ కల్యశ్శ్యావిట్ఛలాకాస్యాచ్ఛారామదన శారికా-అని తాలవ్యాదులయందురభసుడు ౪ రహ్యం తె అనుపయోగినోఽత్ర తేఽత్ర రహః। స-న ॥*రహత్యాగే। అనుపయుక్తులైనజనులు దీనియందు విడువఁబడుదురు*రమంతేఽత్రేతి వా రహః*రము క్రీడాయాం। దీనియందు రమింతురు ౫ రహః అవ్యయము। ఉపాంశు వాక్యం జాతమస్మిన్నితి ఉపాంశు। అవ్యయము। మెల్లనిమాటలు దీనియందు పు

రహస్యంతద్భ వే త్రిషు॥ ౨౭౮॥

ట్టును॥ ౭॥** ఈవిజనస్థలమందు బుట్టినమాట రహస్యమనంబడును। రహసిభవం రహస్యం ॥ త్రి ॥ ఏకాంతస్థలమందుఁబుట్టినది రహస్యము॥ ౧॥

సమౌవిస్రంభ

విస్రంభవిశ్వాసశబ్దములు విశ్వాసము పేళ్లు॥ నమ్మిక। విస్రంభణం విస్రంభః* స్రంభు విశ్వాసే। విశ్వ

విశ్వాసో భ్రేషోభ్రంశో యథోచితాత్। అభ్రేషన్యాయ కల్పాస్తు దేశరూపం సమంజసమ్॥౪౭॥

సించుటవిస్రంభము॥౧॥విశ్వసిత్యనేనవిశ్వాసః*శ్వసప్రాణనే।దీనిచేతనూరడిల్లుదురు॥౨॥*యథోచితతాధ్యథాప్రాప్తాద్ధర్మాత్భ్రంశశ్చలనంభ్రేషఇత్యుచ్యతే।తనకుఉచితమైనధర్మము వలనచలించుటభ్రేషమనంబడును॥భ్రేషణంభ్రేషః*భ్రేషచలనే॥చలించుటభ్రేషము॥౧॥ అభ్రేషశబ్దముమొదలు-౫-తనకుఉచితమైనధర్మమువలనచలించకుండుటపేళ్లు॥నభ్రేషః అభ్రేషః॥ చలించకుండుటఅభ్రేషము॥౧॥నియతమీయతెన్యాయః*ఇణ్గతౌ।నియతముగాపొందఁబడునది॥ ౨॥యథోచితసంకల్పనంకల్పః*కృపూసామర్థ్యే।యథోచితమైనసామర్థ్యముకల్పము॥౩॥దిశ్యమానస్యోచితస్యరూపందేశరూపం।తనకుఉచితమైనధర్మమునకనురూపమైనదిదేశరూపము॥ ౪॥సంగతమంజఃసమంజసం।సత్యముదీనియందుకూడియుండును॥౫॥

యుక్తమౌపయికంలభ్యంభజమానాభినీతవత్ న్యాయ్యంచత్రిషు

యుక్తశబ్దముమొదలు౬-న్యాయముతోఁగూడినదానిపేళ్లు॥న్యాయేనయుక్తం-యుక్తం*యుజిర్యోగే।న్యాయముతోఁగూడినది॥౧॥ఉపాయఏవఔపయికం।ఉపాయమేఔపయికము॥౨॥లబ్ధుంయోగ్యంలభ్యం।పొందుటకుయోగ్యమైనది౩॥న్యాయంభజతెభజమానం*భజసేవాయాం।న్యాయమునుబొందునది॥౪॥అభినీయతెఅభినీతం।అభిముఖముగాపొందింపఁబడునది॥౫॥ఏప్రకారముగాభజమానాభినీతశబ్దములుయుక్తార్థమునుజెప్పుచున్నవో-ఆప్రకారముగాన్యాయ్యశబ్దమనివతిప్రత్యయార్థము॥న్యాయాదనపేతంన్యాయ్యం।న్యాయమువలనబాయనిది॥౬॥యుక్తశబ్దముమొదలున్యాయ్యశబ్దపర్యంతముఆరుశబ్దములుమూఁడులింగములయందువర్తించును*యుక్తాయుక్తములయందునిదియుక్తమనిసమర్థించుటసంప్రధారణమనంబడును॥సంప్రధార్యతెఇదమేవశ్రేయఇతి

త్సంప్రధారణా తు సమర్థనం॥ అపవాదస్తునిర్దేశోనిదేశశ్శాసనంచసః॥శిష్టిశ్చాజ్ఞాచ సంస్థాతుమర్యాదాధారణాస్థితిః ౪౮౧॥

నిశ్చియతేఅనయేతిసంప్రధారణా।ఇదేశ్రేయస్కరమనిదీనిచేతనిశ్చయింపబడును॥౧॥*అపవాదశబ్దముమొదలు౬-ఆజ్ఞపేళ్లు॥అపవదనమపవాదః*వదవ్యక్తాయాంవాచి।అపకృష్టముగాపలుకుటఅపవాదము॥౧॥నిర్దిశ్యతేఉపదిశ్యతేనిర్దేశః-నిదేశశ్చ*దిశఅతిసర్జనే।ఉపదేశింపబడునది॥౨॥౩॥శాస్యతెఅనేనశాసనం।శిష్టిశ్చ॥ఇ-సీ॥శాసుఅనుశిష్టౌ।దీనిచేతశిక్షింపబడునుగనుకశాసనము-శిష్టి౪॥౫॥ఆజ్ఞాపనంఆజ్ఞా।ఆజ్ఞాపించుటఆజ్ఞ॥౬॥*సంస్థాశబ్దముమొదలు౪మర్యాదపేళ్లు॥మేరదప్పకయుండుట॥సంతిష్ఠతేఅనయాసంస్థా*ష్ఠాగతినివృత్తౌ।దీనిచేతలోకముతెస్సనైయుండును॥౧॥మర్యేతిసీమార్థేఅవ్యయం-తత్రదీయతఇతిమర్యాదా*డుధాఞ్ధానే।మర్యయనగాసీమ-అందుఇయ్యబడునది॥౨॥ధార్యతేఅనయాధారణా।దీనిచేతధరింపబడును॥౩॥తిష్ఠంత్యస్యామితిస్థితిః॥ఇ-సీ॥దీనియందుస్థిరులైయుందురు॥౪॥*ఆగశ్శబ్దముమొదలు౩అపరాధముపేళ్లు॥అగతికుటిలంగచ్ఛతిత్యాగః॥స-న॥అగకుటిలాయాంగతౌ।కుటిలముగాపొందునది॥౧॥అపరాధ్యంతెఅనేనేత్యపరాధః *రధహింసాయాం।దీనిచేతహింసింపబడుదురు॥౨॥మన్యతెకష్టమితిమంతుః॥ఉ-పు॥*మనజ్ఞానే కష్టమనితలంపఁబడునది॥౩॥*ఉద్దానబంధనశబ్దములుకట్టివేయుటపేళ్లు॥ఉద్దీయతెఖండ్యతెరక్ష్యతేవాఉద్దానం*దోఅవఖండనే*దేఙ్రక్షణే।దీనియందుఖండింపబడును గనుకనైననురక్షింపఁబడునుగనుకనైననుఉద్దానము॥౧॥బధ్యతఇతిబంధనం*బంధబంధనే।కట్టివేయుటబంధనము॥౨॥*యథోచితమైనదానికంటె-సగముపడిగాదండుగగొనుటద్విపాద్యమనంబడును॥ద్వౌపాదౌప్రమాణమస్మిన్నితిద్విపాద్యః।రెండుభాగములుప్రమాణముగాగలది॥౧॥*భాగధేయశబ్దముమొదలు౩రాజునకుగట్టదగినఅప్పనముపేళ్లు॥భాగఏవభాగధేయః।భాగమేభాగధేయము॥౧॥కీర్యతేప్రత్యేకంకరః*కౄవిక్షేపే।ప్రత్యేకముప్రజలచేతచల్లబడునది॥౨॥బలంత్యనేనబలి-॥ఇ-పు॥బలప్రాణనే। దీనిచేతరాజులుబ్రతుకుదురు॥౩॥*ఘట్టమనఁగాసుంకముగొనుచావిడి-ఆదిశబ్దముచేతనదీతరణము మొదలయినదిఅందురాజునకునియ్యఁదగినద్రవ్యముశుల్కమనంబడును॥శలతిసుఖేనగచ్ఛత్యనేనశుల్కః॥అ-పు॥శలఆశుగమనే।దీనినిచ్చుటచేతసుఖముగాపోవుదురు॥౧॥*ప్రాభృతశబ్దముమొదలు౬రాజదర్శనార్థమైతెచ్చెడుకానుకపేళ్లు॥ప్రకర్షేణాభిర్ఫ్రియతెప్రాభృతం*భృఞ్భరణె।ప్రకృష్టముగాభరింపబడునది॥౧॥ప్రదిశ్యతెదీయతేరాజ్ఞేప్రదేశనం*దిశఅతిసర్జనె।ప్రకృష్ట

సమేతుద్దానబంధనే। ద్విపాద్యోద్విగుణోదండో భాగధేయఃకరోబలిః॥౪౮౨॥

ఘట్టాదిదేయం శుల్కోస్త్రీప్రాభృతంతుప్రదేశనం।ఉపాయనముపగ్రాహ్య

స్యుపహారస్తథో పదా॥౪౮౩॥ యౌతకాదితుయ ద్దేయంసుదాయో హరణంచతత్॥ తత్కాలస్తుతదా త్వంస్యా *దుత్తరఃకాలఆ యతిః సాందృష్టికంఫ లంసద్యః*ఉద ర్కఃఫలముత్త రం*అదృష్టంవ హ్నితోయాది దృష్టంస్వపరచ క్రజం॥౪౮౫॥ మహీభుజామ హిభయంస్వప క్షప్రభవంభ యమ్। ప్రక్రియాత్వధి కారస్స్యా చ్చామరంతుప్ర కీర్ణకం॥౪౮౬॥ నృపాసనంయ త్తద్భద్రాసనం సింహాసనంతుత త్। హైమం ఛత్రంత్వాతప త్రం రాజ్ఞస్తునృపలక్ష్మ తత్॥౪౮౭॥** భద్రకుంభఃపూ ర్ణకుంభో

ముగా రాజుకొరకు ఈయ్యఁబడునది॥౨॥ రాజ్ఞస్సమీపమయతే అనెనెత్యుపాయనం* అయగతౌ। దీని చేత రాజసమీపమును పొందుదురు॥౩॥ ఉపగృహ్యతే రాజ్ఞా ఉపగ్రాహ్యం* గ్రహ ఉపాదానే। రాజుచేత గ్రహింపఁబడునది॥౪॥ ఉపహ్రియతే రాజ్ఞా ఉపహారః* హృఞ్ హరణే। రాజుచేత హరింపఁబడునది॥౫॥ ఉపదీయత ఇతి ఉపదా* దాదానే। రాజసమీపమందు నివ్వఁబడునది॥౬॥* వివాహమందు-అల్లునికిని-ఆడుబిడ్డకును నిచ్చువస్తువు యౌతకమనంబడును॥ అందు సుదాయహరణశబ్దములు వర్తించును॥ యుతయోస్సంగతయోః స్త్రీపుంసయోరిదం యౌతకం। వివాహమందలి కూడుకొనియున్న వధూవరుల సంబంధమైనది॥ సుష్ఠు దీయత ఇతి సుదాయః। లెస్సగా నియ్యఁబడునది॥౧॥ హ్రియతే స్త్రియా స్వాతంత్ర్యేణేతి హరణం* హృఞ్ హరణే। స్త్రీ చేత స్వాతంత్ర్యమున నపహరింపఁబడునది॥౩॥* తత్కాలస్తు తదాత్వశబ్దములు వర్తమానకాలమునకు పేళ్లు॥ సచాసౌ కాలశ్చ తత్కాలః- తదేత్యస్య భావః తదాత్వం॥ అప్పుడు నడుచు కాలము తత్కాలము-తదాత్వమును॥౧॥౨॥* రాఁగల కాలము-ఆయతియనంబడును। ఏష్యతీత్యాయతిః॥ఇ-సీ॥* ఇణ్ గతౌ। రాఁగలది గనుక ఆయతి॥౧॥

సద్యః ఫలం-తాత్కాలికమైన ఫలము సాందృష్టికమనఁబడును॥ సందృష్టం ప్రత్యక్షం ప్రయోజనమస్య సాందృష్టికం। ప్రత్యక్ష ప్రయోజనము గలది సాందృష్టికము॥౧॥* ముందర రాఁగల ఫలము-ఉదర్కమనంబడును॥ ఉదచ్యతే ఇతి ఉదర్కః* అర్చ పూజాయాం। మిక్కిలి సమ్మానింపఁబడునది॥౧॥

అగ్నిజలాదులవలనఁ బుట్టిన భయము అదృష్టమనంబడును॥ ఆదిశబ్దముచేత-వ్యాధిదుర్భిక్ష మూషకశలభాదులవలనఁ బుట్టిన భయంబును-అదృష్టమనంబడును॥ నదృష్టం అదృష్టం దైవకృతత్వాత్। దైవకృతమౌటవలన కానఁబడనిది॥౧॥* రాజులకు తన బలమువలనను పగవారివలనను బుట్టిన భయము-దృష్టమనంబడును॥ దృశ్యత ఇతి దృష్టం। కానఁబడునది॥

రాజులకు మూలబలము మొదలగు నేడువిధములైన స్వపక్షములవలనఁ బుట్టిన భయము అహిభయమనంబడును॥ అహేరివ భయం అహిభయం॥ సర్పభయమువంటి భయము॥౧॥ పక్షశబ్దముచేత మూలబలము మొదలైన యేడువిధములును జెప్పఁబడును॥ శ్లో॥ నిజోऽథ మైత్రశ్చ సమాశ్రితశ్చ సంబంధజః కార్యసముద్భవశ్చ భృత్యో గృహీతో వివిధోపచారైః పక్షం బుధాస్సప్తవిధం వదన్తి॥ నిజమనగా మూలబలము మిత్రబలము మైత్రము। తన్ను రక్షించుకొనుటకొఱకు వచ్చి యాశ్రయించినవాడు సమాశ్రితుడు। తల్లిదండ్రులదిక్కువాడు సంబంధజుడు। పరస్పరోపకారముచేత వచ్చి కూడినవాడు కార్యసముద్భవుడు। జీతగాడు భృత్యుడు। ఉపచారముచేత స్వవశముగా జేసుకొనఁబడినవాడు ఉపచారగృహీతుడు॥ ఈ యేడ్వురును స్వపక్షములనంబడుదురు* ప్రక్రియాధికారశబ్దములు అధికారము పేళ్లు॥ ప్రకర్షేణ క్రియత ఇతి ప్రక్రియా। ప్రకర్షముగాఁ జేయఁబడునది॥౧॥ కర్మవిశేషమధికృత్య కర్తృభిః క్రియత ఇత్యధికారః। కర్మవిశేషమును అధికరించి కర్తలచే జేయఁబడునది॥౨॥ * చామర ప్రకీర్ణకశబ్దములు వింజామరము పేళ్లు॥ చమరమృగసంబంధి చామరం। చమరమృగసంబంధమైనది॥౧॥ ప్రకీర్యతే రాజసమీప ఇతి ప్రకీర్ణకం* కౄ విక్షేపే। రాజసమీపమందు విసరఁబడునది॥౨॥* రాజులు గూర్చుండునట్టి సామాన్యమైయున ఆసనము-భద్రాసనమనంబడును॥ భద్రం చ తత్ ఆసనం చ భద్రాసనం। శుభమైన ఆసనము॥౧॥ నృపస్యాసనం నృపాసనం। రాజుయొక్క ఆసనము నృపాసనము॥** బంగారుతోఁ జేయఁబడిన ఆభద్రాసనము సింహాసనమనంబడును॥ సింహాకృతియుక్తమాసనం సింహాసనం। సింహాకృతితో గూడిన ఆసనము సింహాసనము॥౧॥* ఛత్రాతపత్రశబ్దములు గొడుగు పేళ్లు॥ ఛాద్యతే పురుషోనేనేతి ఛత్రం* ఛద అపవారణే। దీనిచేత పురుషుఁడు కప్పఁబడును॥ ఆతపాత్ త్రాయత ఇతి ఆతపత్రం* త్రైఙ్ పాలనే। ఎండవలన రక్షించునది॥౨॥** రాజునకు పట్టునట్టి గొడుగు నృపలక్ష్మ యనంబడును॥ నృపాణాం లక్ష్మ నృపలక్ష్మ॥ న-న॥ రాజులకు చిహ్నమయినది॥౧॥ ** భద్రకుంభ పూర్ణకుంభశబ్దములు రాజద్వారాదులయందు పెట్టఁబడిన పూర్ణకలశము పేళ్లు॥ భద్రార్థః కుంభః భద్రకుంభః। మంగళార్థమయిన కుంభము॥౧॥ పూర్ణశ్చాసౌ కుంభశ్చ పూర్ణకుంభః। పూర్ణమయిన కుంభము॥౨॥ **

భృంగారః కనకాలుకా। నివేశశ్శిబిరం షండే* సజ్జనంతూపరక్షణం॥౪౮॥ హస్త్యశ్వరథపాదాతం సేనాంగం స్యాచ్చతుష్టయం* దంతీ దంతావలో హస్తీ ద్విరదోఽనేకపో ద్విపః॥౪౯॥ సింధురస్సామజః కుంభీ మాతంగశ్చ ముదావళః॥ మతంగజో గజో నాగః కుంజరో వారణః కరీ। ఇభః స్తంబేరమః పద్మీ యూథనాథస్తు యూథపః॥౫౦॥ మదోత్కటో మదకలః కలభః కరిశావకః ప్రభిన్నో గర్జితో మత్తః సమావుద్వాంతనిర్మదౌ॥౫౧॥ హాస్తికం గజతా బృందే ** కరిణీ ధేనుకా వశా। గండః కటో మదో దానం

భృంగారకనకాలుకాశబ్దములు బంగారుగిండి పేళ్లు॥ హూజియను॥ భ్రియతే జలమనేనేతి భృంగారః।దీని చేత జలము భరింపబడును॥ కనకమయా సా ఆలుకా చ కనకాలుకా।సువర్ణమయమైనగిండి ౨ నివేశశిబిరశబ్దములు దండు వెళ్లిన దిక్కున విడిసిన పాళెము పేళ్లు॥ నివిశ్యత ఇతి నివేశః* విశ ప్రవేశనే।ప్రవేశింపబడునది॥౧॥ శేరతే త్ర శిబిరం* శీఙ్ స్వప్నే।దీనియందు మనిద్రింతురు॥౨॥* సజ్జన ఉపరక్షణశబ్దములు శిబిరరక్షార్థమై చుట్టు పెట్టిన వెలుగు మొదలయిన దాని పేళ్లు॥ సత్ స్వాస్థ్యం జన్యతే నేనేతి సజ్జనం శిబిరమునకు స్వాస్థ్యము దీని చేత పుట్టింపబడును॥ ఉపరక్ష్యతే నేనేతి ఉపరక్షణం। దీని చేత శిబిరము రక్షింపబడును॥ ౨॥* పదాతీనాం సమూహః పాదాతం- హస్తినశ్చ-అశ్వాశ్చ-రథాశ్చ- పాదాతంచ-హస్త్యశ్వరథపాదాతం ద్వంద్వైకవద్భావః।ఏనుగులు-గుఱ్ఱములు-రథములు-కాలుబంటులును-అను నీనాలుగును-సేనాంగములనంబడును- సేనాయా అంగం సేనాంగం- సేనకు అంగము॥౧॥ దంతిశబ్దము మొదలుగ ౧౫ ఏనుఁగు పేళ్లు॥ దంతావస్య స్త ఇతి దంతీ।న-పు॥ దంతావళశ్చ।దంతములుగలది.౨॥ హస్తో స్యాస్తీతి హస్తీ॥న-పు॥ తొండముగలది ౩ ద్వౌ రదావస్య ద్విరదః। రెండు కొమ్ములుగలది ౪ అనేకేన హస్తేన వక్త్రేణ చ పిబతీతి అనేకపః- ద్వాభ్యాం పిబతీతి ద్విపః* పా పానే। తొండము నోరు అనునీ రెంటి చేతను పానము చేయునది ౬॥ మతంగాదృషేర్జాతో మతంగజః। మతంగుడను ఋషి వలనబుట్టినది ౭॥ గజతి మాద్యతీతి గజః* గజ మదే।మదించునది॥౮॥ నగే గిరౌ భవో నాగః।పర్వతమందు బుట్టినది॥౯॥ కుంజౌ కుంభాధోగతౌ వస్య స్త ఇతి కుంజరః।కుంజములనఁగా కుంభస్థలములకు దిగువనుండెడు గుంతలు-అవిగలిగినది॥౧౦॥ పరబలం వారయతీతి వారణః* వృఞ్ వరణే। పరబలమును అడ్డపెట్టునది॥౧౧. కరో స్యాస్తీతి కరీ।న-పు॥ తొండముగలది॥౧౨॥ ఏతి మదమితి ఇభః* ఇణ్ గతౌ।మదమును పొందునది॥౧౩॥ స్తంబే తృణగుల్మే రమత ఇతి స్తంబేరమః* రము క్రీడాయాం।పొదలయందు క్రీడించునది॥౧౪॥ పద్మం బిందుజాలకమస్యాస్తీతి పద్మీ॥న-పు॥ పద్మమనగా దేహమందలి బొట్లు అవిగలిగినది॥౧౫॥* యూథనాథ యూథప శబ్దములు ఏనుఁగు మూకలలో ముఖ్యమైన యేనుఁగు పేళ్లు॥ యూథస్య నాథో యూథనాథః।యూథమనఁగా సమూహము-దానికి నాథుడు॥౧॥ యూథం పాతీతి యూథపః* పా రక్షణే।సమూహమును పాలించునది॥౨॥** మదోత్కట మదకల శబ్దములు మదించిన యేనుఁగు పేళ్లు॥ మదేన ఉత్కటో మదోత్కటః- మదము చేత వ్యాప్తమయినది॥ ౧॥ మదేన కలో మనోజ్ఞో మదకలః।మదము చేత మనోజ్ఞమయినది॥౨॥ ** కలభ కరిశావక శబ్దములు ఏనుఁగు పిల్ల పేళ్లు॥ కం ఉదకం లభత ఇతి కలభః* డులభ్ష్ ప్రాప్తౌ। ఉదకమును పొందునది॥౧॥ కరిణః శావకః కరిశావకః। ఏనుఁగు పిల్ల॥౨॥ కరిపోతకః॥ ౨॥ పంచవర్షో గజో బాలః పోతస్తు దశవార్షికః। వింశతివర్షస్తు కలభస్త్రింశదబ్దకః॥ ప్రభిన్న శబ్దము మొదలు ౩ మదము గారుచున్న యేనుగు పేళ్లు। మదము నిలకడగానున్న యేనుఁగని కొందరు॥ ప్రకర్షేణ భిన్నః ప్రభిన్నః।మిక్కిలి భేదమునొందినది॥౧॥ గర్జనమస్య సంజాతమితి గర్జితః। గర్జించునది॥౨॥ మాద్యతీతి మత్తః* మదీ హర్షగ్లపనయోః। మదించునది॥౩॥ ** ఉద్వాంత నిర్మద శబ్దములు మదము విడిచిన యేనుఁగు పేళ్లు॥ మదము ఉద్వాంతమనేన ఇతి ఉద్వాంతః* టువము ఉద్గిరణే।మదము వెళ్లించినది॥ ౧ ॥ నిర్గతో మదాత్ నిర్మదః। మదమువలనఁ బాసినది॥ ౨ ॥ రాజవాహ్యస్త్వౌపవాహ్యస్సాన్నాహ్యస్సమరోచితః ** హాస్తిక గజతా శబ్దములు - ఏనుఁగ మూక పేళ్లు ॥ హస్తినాం సమూహో హాస్తికం ॥ గజానాం సమూహో గజతా। ఏనుఁగుల యొక్క గుంపు- హాస్తికము- గజతయును॥౧॥౨॥ ** కరిణీ శబ్దము మొదలు ౩॥ ఆఁడ యేనుఁగు పేళ్లు॥ కరో స్యా అస్తీతి కరిణీ ఈ-స్త్రీ॥ తొండము గలది॥౧॥ ధయంత్యేనాం గజశిశవ ఇతి ధేనుకా* ధేట్ పానే।ఏనుఁగు పిల్ల దీని చన్ను గుడుచును ॥౨॥ వష్టి కామయతే గజమితి వశా* వశ కాంతౌ। ఏనుఁగు కామించునది॥ ౩ ॥* గండ కట శబ్దములు ఏనుఁగు చెక్కిల పేళ్లు॥ గండ్యత ఇతి గండః* గడి వదనైకదేశే।ముఖైకదేశమయినది॥౧॥ కటతి మదం కటః * కటే వర్షావరణయోః। మదమును వర్షించునది॥ ౨॥ ** మద దానశబ్దములు మదము పేళ్లు ॥ మాద్యతే నేనేతి మదః * మదీ హర్షగ్లపన

వమథుః కరశీకరః ॥ ౩౫ ॥ *కుంభౌ తు పిండౌ శిరసస్తయోర్మధ్యే విదుః పుమాన్ । *అవగ్రహో లలాటం స్యాత్ దీషికా త్వక్షికూటకం ॥ ౩౬ ॥ అపాంగదేశో నిర్యాణం *కర్ణమూలం తు చూలికా ॥ *అధః కుంభస్య వాహిత్థం ప్రతిమానమధోఽస్య యత్ ॥ ౩౭ ॥ ఆసనం స్కంధదేశస్స్యాత్ *పద్మకం బిందుజాలకం । *పక్షభాగః పార్శ్వభాగో దంతభాగస్తు యోఽగ్రతః ॥ ౩౮ ॥ *ద్వౌ పూర్వపశ్చాజ్జంఘాదిదేశౌ గాత్రావరే క్రమాత్ । *తోత్రం వైణుకం ఆలానం బంధస్తంభే *థ శృంఖలే ॥ ౩౯ ॥ అందుకో నిగళోఽస్త్రీ స్యాత్ అంకుశోఽస్త్రీ సృణిః ద్వయోః । దూష్యా కక్ష్యా వరత్రా స్యాత్

యోః। దీని చేత మదించును ॥౧॥ ద్యతి ఖండయతీతి దానం * దో అవఖండనే. ఏనుఁగును పీడించునది ॥ ౨ ॥ ఏనుఁగు తొండము వలనఁ బుట్టిన తుంపురులు వమథు వనంబడును ॥ వమ్యత ఇతి వమథుః ॥ ఉ-పు ॥ * టువమ ఉద్గిరణే । వెళ్లింపఁబడునది ॥౧॥ ** ఏనుఁగు తలమీఁదనుండెడు మాంసపుంజములు రెండును కుంభములనంబడును ॥ కుంభాకృతియోగాత్కుంభౌ ॥ ఉ-పు । కుంభములవంటి ఆకారము గలది ॥౧॥ ** ఆ రెంటి నడుము విదువనంబడును ॥ వేత్త్యస్మిన్ అంకుశఘాతమితి విదుః ॥ ఉ-పు ॥ * విద జ్ఞానే । దీనియందు అంకుశఘాతము నెఱుఁగును ॥౧॥ * ఏనుఁగు మొసలు అవగ్రహమనంబడును ॥ అంకుశేనావగృహ్యత ఇత్యవగ్రహః * గ్రహ ఉపాదానే । అంకుశము చేత తీయఁబడునది ॥

ఏనుగు కనుగుడ్డు - ఈషిక యనంబడును । ఈషాలాంగలి కేవ ఈషికా । నాగేలు వలెనిడివియైనది ॥ దీర్ఘాదిహ్రస్వమధ్యము - హ్రస్వాదిదీర్ఘమధ్యమని కొందరు ॥౧॥ అక్షికూటకమక్షిగోళకం ॥ ఏనుఁగు కడగన్నులు నిర్యాణమనంబడును ॥ నిర్యాతి నేత్రజలమస్మాదితి నిర్యాణం * యా ప్రాపణే । కన్నీళ్లు దీనివలన జారును ౧॥ * ఏనుఁగు చెవిమొదలు చూళికయనంబడును ॥ చుల్యతే అంకుశేన ప్రేర్యత ఇతి చూలికా * చుల ప్రేరణే । అంకుశము చేత ప్రేరేపింపఁబడునది ॥౧॥ * ఏనుఁగు కుంభస్థలములకు దిగువనున్న ప్రదేశము వాహిత్థమనంబడును । మదవాహినిస్థానే తిష్ఠతీతి వాహిత్థం । మదప్రవాహస్థానమందుండునది ॥౧॥ * ఈ వాహిత్థమునకు దిగువనున్న ప్రదేశము ప్రతిమానమనంబడును । ప్రతిమీయతే అనేన ప్రతిమానం * డుమిఞ్ ప్రక్షేపణే । దీనిచేత నెత్తివేయఁబడును ॥౧॥

ఏనుఁగు యొక్క మూఁపు ఆసనమనంబడును ॥ అస్యతే అస్మిన్నిత్యాసనం * ఆస ఉపవేశనే । దీనియందుండబడును ॥౧॥ * ఏనుఁగునకు యౌవనమందు దేహమునఁ బుట్టిన బొట్లు పద్మకమనంబడును । ఏనుఁగు సిబ్బెము । పద్మవర్ణసామ్యాత్ పద్మకం । పద్మము వన్నెగలది ॥౧॥ * ఏనుఁగుయొక్క యుభయపార్శ్వములను పక్షభాగమనంబడును ॥ పక్షయోర్భాగః । పక్షభాగః పక్షములయొక్క భాగము ॥౧॥ ఏనుగు యొక్క ముందరి భాగము దంతభాగమనంబడును ॥ దంతసన్నిహితో భాగో దంతభాగః । దంతములకు సమీపమయిన భాగము ॥౧॥ * ఏనుఁగు ముందరి కాళ్లు మొదలుగాఁగల భాగము గాత్రమనంబడును ॥ వెనకటి కాళ్లు మొదలుగాఁగల భాగము - అవరమనంబడును ॥ గాత్రస్య ప్రధానాంగత్వాత్ గాత్రం ॥ గాత్రమునకు ప్రధానాంగము ॥౧॥ అప్రధానాంగత్వాత్ అవరం । అప్రధానమయిన అంగము అవరము ॥ పా ॥ అవరం ॥౧॥ * తోత్ర వైణుక శబ్దములు ఏనుఁగును శిక్షించు నట్టి కోల పేళ్లు ॥ తుద్యతే అనేన గజ ఇతి తోత్రం * తుద వ్యథనే । దీనిచేత నేనుఁగు వ్యథపెట్టంబడును ॥౧॥ వేణువా నివృత్తం వైణుకం । వెదురు చేతఁ జేయఁబడినది ॥ ౨ ॥ వేణుకమని కొందరు ॥ * ఏనుఁగును కట్టు స్తంభము ఆలానమనంబడును ॥ ఆలీయతే గజోఽస్మిన్నిత్యాలానం * లీఙ్ ఆదానే । దీనియందు నేనుఁగు తెచ్చి కట్టఁబడును ॥౧॥ * శృంఖలశబ్దము మొదలు ॥౩॥ ఏనుఁగను కట్టుగొలుసు పేళ్లు ॥ శృణాతి బంధనేన గజమితి శృంఖలం ॥ త్రి ॥ శౄ హింసాయాం । గజమును హింసించునది ॥ తాలవ్యాది ॥ శ్లో ॥ స్త్రీకటీవస్త్రబంధేపి నిగళే శృంఖలా త్రిషు - అని - తాలవ్యాదుల యందురభసుఁడు ॥౧॥ అందతి బధ్నాత్యనేనేత్యందుకః * అది బంధనే । దీనిచేత కట్టివేయుదురు ॥౨॥ నిగళ్యతే మదేనేతి నిగళః * గళ సేచనే । మదము చేత తడపఁబడునది ॥ పా ॥ నిగడః ౩ * అంకుశ శృణిశబ్దములు అంకుశము పేళ్లు । అంక్యతే నేనేత్యంకుశః ॥ అ-న్న * అకి లక్షణే । దీనిచేత నేనుఁగు గురుతు పడియుండును ॥౧॥ సరత్యనయా సృణిః ॥ ఇ-స్త్రీ ॥ * సృ గతౌ । ఏనుఁగు దీనిచేత పోవును ॥ శ్లో ॥ ఆరక్షమగ్నమవమత్య సృణిం శితాగ్రమేకః పలాయితజనేనకృతార్తనాదః - అని మాఘమందు పుల్లింగప్రయోగము గలదు గనుక - సృణిః స్త్రియాం - అనునది ప్రమాదపాఠము ద్వయోః అను పాఠము యుక్తము । స్త్రియాం అని ఏకదేశలక్షణము చేత పుల్లింగము చెప్పఁబడునని కొందరందురు ॥ ౨ ॥ ** దూష్యాశబ్దము మొదలు ౩ ఏనుఁగు నడుమునకు గట్టెడు తోలుమోకు పేళ్లు ॥ దూష్యతే అనయా దూష్యా * దూషి పరితాపే. దీనిచేత తపింపఁజేయఁబడును ॥ దూష్యా అని చకారాదియు- యకార రహితమని కొందరు ॥ ౧ ॥ కక్ష్యాయాం గజమధ్యభాగే భవా కక్ష్యా । గజమధ్యభాగమం

దుండునది॥కణ్ఠ్యాకణ్ఠా అని ణాంతమునవిశ్వప్రకాశిక॥ యాంతమని-అజయుఁడు॥ ౨॥ ప్రియతేగ

త్కల్పనాసజ్జనా సమే॥౪౯౭॥

జమధ్యమనయేతివరత్రా॥వృఞ్ వరణే।దీనిచేతగజమధ్యముగప్పఁబడును॥౩॥**కల్పనా సజ్జనాశబ్దములు రాజారోహణార్థమై యేనుఁగును శృంగారించుట పేళ్లు॥కల్ప్యతేకల్పనా॥కృపూ సామర్థ్యే।క ల్పింపఁబడునది॥౧॥సజ్జ్యతేఅనయా సజ్జనా॥షస్జగతౌ। గతిజ్ఞానార్థః। దీనిచేత నెఱుఁగఁబడును॥౨॥

ప్రవేణ్యాస్తరణం వర్ణః పరిస్తోమః కుథో ద్వయోః।

ప్రవేణీశబ్దము మొదలు౫ ఏనుఁగుమీఁద పరచునట్టి రత్నకంబళి పేళ్లు ॥ ప్రకర్షేణవయంత్యేనామితి ప్రవేణీ॥ ఈ-స్త్రీ॥వ్యేఞ్ తంతుసంతానే।నిక్కిలిదీనేయుదురు॥౧॥ ఆస్తీర్యతఇత్యాస్తరణం॥ స్తృ ఞ్ ఆచ్ఛాదనే।కప్పఁబడునది॥౨॥వర్ణ్యతేచిత్రవర్ణత్వేనేతివర్ణః॥వర్ణ స్తుతౌ । చిత్రమాట చేత స్తోత్రము చేయఁబడునది ॥ ౩ ॥ పరిస్తూయతెపరిస్తోమః॥ష్టుఞ్ స్తుతౌ।స్తోత్రము చేయఁబడునది॥౪॥ గజపృష్ఠేకుథ్నాతీతికుథః॥ అ-ప్స॥*కుథ శ్లేషణే। ఏనుఁగువీఁపుననుండునది॥ మూఁడులింగములయం దుఁగలదనికొందరు॥ శ్లో॥ స్త్రియాం వేణీకుథంత్రిషు- అనివాచస్పతి॥౫॥ **యుద్ధమునకుసమ

వీతం త్వసారం హస్త్యశ్వం

ర్థముకాని-ఏనుఁగు-గుఱ్ఱమును-వీతమనఁబడును॥విగతంఇతంగమనమస్యేతివీతం॥ఇణ్ గతౌ। గమ

వారీ తు గజబంధనే॥౪౯౮॥

నము లేనిది॥౧॥**ఏనుఁగును పట్టుటకొఱకు చేయఁబడిన-ఓఁదము మొదలయినది- వారియనంబడును॥ వార్యతేగజోనయేతివారీ॥ ఈ-స్త్రీ॥దీనిచేత నేనుఁగునిలుపఁబడును॥౧॥**

ఘోణకే వీతి తురగ తురంగా శ్వతురంగమాః। వాజి వాహార్వ గంధర్వ హయ సైంధవ సప్తయః॥౪౯౯॥

ఘోటకశబ్దము మొదలు ౧౩ గుఱ్ఱము పేళ్లు॥భూమౌఘుటతిపరివర్తతఇతి ఘోటః-సఏవ ఘోటకః॥ఘుటపరివర్తనే।భూమి యందుపొర్లాడునది॥౧॥ వేతిగచ్ఛతీతివీతిః॥ఇ-పు॥వీగతిప్రజనకాంత్యసనఖాదనేషు। వేగముగాఁ బోవునది।పకారాదిగాకొందరు చెప్పుదురు॥శ్లో॥పానె స్త్రీపీతిరశ్వేనా- అనిరుద్రుఁడు॥౨॥తురంత్వ రితంగచ్ఛతీతితురగః।తురంగః।తురంగమశ్చ। వేగిరముగాబోవునదితురగము-తురంగము-తురంగ మము॥౩॥౪॥౬॥అశ్నుతేగమనేనేత్యశ్వః॥అశూ వ్యాప్తౌ। గమనము చేతవ్యాపించినది॥౫॥ వాజో వేగ స్తద్యోగాద్వాజీ॥న-పు॥వజగతౌ।వాజమనఁగా వేగము-అదిగలది॥౭॥వహతినరం వాహః॥వహ ప్రాపణే।నరునివహించునది॥౮॥అర్వతియాతిఅర్వా॥న-పు॥అర్వగతౌ। వేగముగాఁబోవునది॥త కారాంతంబునుగలదు॥శ్లో॥శ్లథీకృతప్రగ్రహమర్వతాం ప్రజాః-అనిమాఘము॥ ౯॥ గంధ్యతేకశా దినాపీడ్యతఇతిగంధర్వః॥గంధ అర్దనే। కశాదులచేతపీడింపఁబడునది॥ ౧౦॥ హయతిగచ్ఛతీతిహ యః॥హయగతౌ।శీఘ్రముగాఁబోవునది॥౧౧॥సింధుదేశభవఃసైంధవః। సింధుదేశమందుఁబుట్టిన ది॥౧౨॥సపతి సేవాదిధర్మేణసప్తిః॥ఇ-పు॥షపసమవాయే। సేవాదిధర్మములతోఁగూడినది॥

ఆజానేయాః కులీనాస్స్యు ర్వినీతా స్సాధువాహినః। వనాయుజాః పారశీకాః కాంభోజా బాహ్లీకా హయాః॥౫౦౦॥

మంచికులమందుఁ బుట్టినగుఱ్ఱములు - ఆజానేయములనంబడును ॥ అజేన వేగేనఆనేయాః ఆజానే యాః॥అజగతిక్షేపణయోః। వేగము చేఁదేఁదగినవి॥౧॥** మనుష్యునిలెస్సగా మోయనేర్చినగుఱ్ఱ ములు- వినీతములనంబడును॥ వినీయంతఇతివినీతాః॥ణీఞ్ ప్రాపణే। లెస్సగాశిక్షింపఁబడునది॥౧॥ వనాయుజశబ్దము మొదలు౪- ఆయాదేశములయందుఁబుట్టిన-అశ్వముల పేళ్లు॥ వనాయుదేశభవా వనాయుజాః।వనాయుదేశమందుబుట్టినవి-హ్రస్వాది॥శ్లో॥ పారశీకావనాయుజాః- అనియుత్పలి ని॥దీర్ఘాదియునుగలదు॥ శ్వేతంకర్కాఖ్యంవానాయుజమపిపారసీకంతు- అనినామమాల॥౧॥ పారశీకదేశభవాఃపారశీకాః। పారశీకదేశమందుఁబుట్టినవి॥పా॥పారసీకాః॥౧॥ కాంభోజదేశ భవాఃకాంభోజాః।కాంభోజదేశమందుఁబుట్టినవి॥౧॥ బాహ్లీకదేశభవాఃబాహ్లీకాః। బాహ్లీకదే శమందుఁబుట్టినవి॥౧॥

యయురశ్వోశ్వమేధీయో

**అశ్వమేధమునకునర్హమైనఅశ్వము యయువనంబడును॥ విసృష్టో దేశే దేశేయాతీతియయుః॥ ఉ-పు॥ యాప్రాపణే। విడువఁబడినదై ప్రతిదేశమునకుఁబోవునది॥౧॥**

జవనస్తు జవాధికః।

అధికమైనవేగముగల-అశ్వము జవనమనఁబడును॥ జవతివేగేనజవనః॥జుగతౌ। వేగమునఁబోవునది॥

పృష్ఠ్యస్థౌరీ

పృష్ఠ్యస్థౌరిశబ్దములు మోపుమోసెడు అశ్వము పేళ్లు॥ పృష్ఠేనవోఢుంశక్యః పృష్ఠ్యః। వీఁపున మోయుటకుసమర్థమైనది॥౧॥స్థూలస్యపృష్ఠభాగస్యేదంస్థౌరంబలం- తదస్యాస్తీతిస్థౌరీ॥న-పు॥ర లయోరభేదః। అధికమైనవీపుసత్తువగలది॥ స్థూరియనికొందరందురు॥౨॥ **

సితః కర్కో

తెల్లనిగుఱ్ఱముకర్క మనంబడును॥కరోతికౌతుకంకర్కః॥ డుకృఞ్ కరణే। కౌతుకమును జేయునది॥౧॥**

రథ్యో వోఢా రథస్య

రథమును వ

యః॥౫౦౧॥*బాలః
కిశోరో**వామ్య
శ్వాబడబా
బాడబంగణే।
త్రిష్వాశ్వీనంయద
శ్వేనదినేనైకేనగ
మ్యతే॥౫౦౨॥**క
శ్యంతుమధ్యమశ్వా
నాం*హేషాహ్రే
షాచనిస్వనః।*నిగా
ళస్తుగళోద్దేశే
బృందేత్వశ్వీయమా
శ్వవత్॥౫౦౩॥*ఆ
స్కందితంధౌరితకం
రేచితంవలితంప్లుతం
గతయోఽమూఃపంచ
ధారాః
ఘోణాతుప్రోథమ
స్త్రియామ్॥*కవికా
తుఖలీనోఽస్త్రీ
శఫంక్లీబేఖురఃపు
మాన్।
పుచ్ఛోఽస్త్రీలూమ
లాంగూలేవాలహ
స్తశ్చవాలధిః॥౫౦౪॥
త్రిషూపావృత్తలుఠి
తౌపరావృత్తేము
హుర్భువి।
యానేచక్రిణియు
ద్ధార్థేశతాంగస్స్యం

హించుగుఱ్ఱమురథ్యమనంబడును॥రథంవహతీతిరథ్యః।రథమునువహించునది॥౧॥** గుఱ్ఱపుపిల్లకి
శోరమనంబడును॥కశ్యత ఇతి కిశోరః*కశగతిశాసనయోః।శిక్షింపఁబడునది॥౧॥** వామీశబ్దము
మొదలు౩గోడిగెపేళ్లు॥ఆఁడుగుఱ్ఱము॥ వమతిగర్భం వామీ॥ఈ-సీ॥* టువముఉద్గిరణే। గర్భము
నువెళ్లించునది॥౧॥అశ్వజాతిస్త్రీ అశ్వా।ఆఁడుగుఱ్ఱము॥౨॥ వలతేబడబా*వలసంచలనే। వబయో
ర్లడయోశ్చైకత్వం।చలించునది॥౩॥ **బడబానాంసమూహోబాడబం। గోడిగెగుఱ్ఱముల
మూఁకబాడబమనంబడును॥౧॥** అశ్వేనఏకేనదినేనయద్వర్త్మగమ్యతేతదాశ్వీనమిత్యుచ్యతే।
గుఱ్ఱముచేతనొకదినంబునఁబోఁదగినతెరువు - ఆశ్వీనమనంబడును ॥ అశ్వేనదినేనఏకేనగమ్యత ఇ
త్యాశ్వీనం।గుఱ్ఱముచేతనొకదినంబునఁబోదగినత్రోవ॥౧॥**అశ్వానాంమధ్యంకశ్యమిత్యుచ్యతే
గుఱ్ఱమునడుముకశ్యమనంబడును॥కశామర్హతీతికశ్యం।తరటునకుఁదగినది**హేషాహ్రేషాశబ్ద
ములుగుఱ్ఱముసగిలించుటపేళ్లు॥హేషణంహేషా-హ్రేషాచ* హేషృహ్రేషృఅవ్యక్తేశబ్దే। అవ్య
క్తముగామ్రోయుటహేషహ్రేషయును॥౧॥**గుఱ్ఱపుమెడలదగ్గిరిప్రదేశమునిగాళమనంబడును॥
ఆప్రదేశమన్దేదేవమణియుండును॥నిగళత్యనేనకబళమితినిగాళః*గళఅదనే।దీనిచేతఆహారమును
మ్రింగును॥శ్లో॥ఘంటాబంధసమీపస్థోనిగాళఃకీర్తితోబుధైః। తస్మిన్దేవమణిర్నామసశుభఃకీర్తి
తోమతః॥౧॥**అశ్వీయాశ్వశబ్దములుగుఱ్ఱపుమూఁకపేళ్లు॥ అశ్వానాంసమూహఃఅశ్వీయం। ఆ
శ్వంచ।అశ్వసమూహముఅశ్వీయముఆశ్వము॥ ౧॥ ౨॥ ** ఆస్కందితశబ్దముమొదలు౫గుఱ్ఱము
యొక్కగతివిశేషములు-అవిధారలనంబడును॥ధార్యతేతురగైరితిధారా-అశ్వములచేతధరింపఁబ
డునది॥౧॥ఆస్కందనంఆస్కందితం*స్కందిర్గతిశోషణయోః।చాతుర్యేణాధోరణంధౌరితకం*
ధోర్గతిచాతుర్యే। రేచనంరేచితం*రిచిర్పృథగ్భావే।వలనంవలితం*వలసంచలనే॥పా॥వల్గితం
ప్లవనంప్లుతం*ప్లుఙ్గతౌ।నిశ్చలమైఅతివేగముఅతిమందమునుగాకసమమైయున్నగతి-ఆస్కందిత
ము॥అంతకంటెనధికమైచతురమైనగతిధౌరితకము॥తాళగతితోపేరెముగాఁదిరుగుటరేచితము॥
వేగముచేతవిడువఁబడినదై మీఁదికిగాళ్లుకదిలించుటవలితము॥ వేగమునఅంతమేరయు సమముగా
పోవుటప్లుతము**అశ్వముముక్కు-ప్రోథమనంబడును॥ప్రోథతీతిప్రోథః॥అ-ప్న॥*ప్రోథృపర్యా
ప్తౌ। దట్టమైయుండునది॥౧॥ **కవికాఖలీనశబ్దములుకళ్లెముపేళ్లు॥ కవతిభక్షణసమయేకవికా*
కుశబ్దే।భక్షణసమయమందుమ్రోయునది॥౧॥ఖలతిచలతీతిఖలీనః। అ-ప్న*ఖలచలనే। కదులున
ది*ఖేముఖవివరేలీనోవాఖలీనః।ముఖవివరమందులీనమైయుండునది ॥ దీర్ఘమధ్యమమునుహ్రి
స్వమధ్యమమునుగలదు ॥ శ్లో ॥ ప్రోత్తైఃస్కంధదేశే శిఖరఖలినకళాకర్కశాద్వ్యాంతముగ్రైః
అనివిశాఖదంతుడు॥౨॥**శఫఖురశబ్దములుగొరిసెలపేళ్లు॥శాయతేభువాశఫం*శోతనూకర
ణే।భూమిచేతనల్పముగాజేయబడునది॥౧॥ఖురతిభువంఖురః*ఖురఛేదనే।భూమినిఛేదించునది॥
౨॥పుచ్ఛశబ్దముమొదలు౫గుఱ్ఱముమొదలైనవానితోఁకపేళ్లు॥వాలహస్తవాలధిశబ్దములుకేశయుక్త
మైనతోఁకపేళ్లనికొందరు॥పుచ్ఛయతేదంశాదీనుత్సారయతీతిపుచ్ఛః॥అ-ప్న॥*పుచ్ఛవిశరణే
ఈఁగెలుమొదలయినదాన్నిపోఁగొట్టునది॥౧॥లూయంతేరోమాణ్యత్రేతిలూమ*లూఞ్ఛేదనే।
రోమములుదీనియందుకోయఁబడును॥నకారాంతనపుంసకము-అకారాంతనపుంసకమనికొందరు॥
౨॥లంగతిచలతీతిలాంగూలం*లగిగతౌ।కదలునది॥౩॥వాలసమూహయోగాత్వాలహస్తః।వాల
సమూహముగలది॥౪॥వాలాధీయంతేఽస్మిన్నితివాలధిః॥ ఇ - పు॥* డుధాఞ్ధారణపోషణయోః।
వాలముదీనియందుధరింపఁబడును॥౫॥ ** ఉపావృత్తలుఠితశబ్దములుభూమియందుపలుమాఱు
పొరలాడినఅశ్వముపేళ్లు॥అవిమూఁడులింగములయందువర్తించును॥ ఉపావర్తతేస్మఉపావృ
త్తః*వృతువర్తనే।లుఠతిస్మలుఠితః*లుఠప్రతిఘాతే। పొరలాడినదిగనుకఉపావర్తము-లుఠి
తమును॥౧॥౨॥**శతాంగశబ్దముమొదలు౩బండికండ్లతోఁగూడినయుద్ధార్థమైనవాహనముపేళ్లు॥
శతంఅంగాన్యస్యేతిశతాంగః।నూఱుఅవయవములుగలది॥౧॥ స్యందతేయాతీతిస్యందనః*స్యం

**దనో రథః॥౨౦౬॥***

మూ ప్రస్రవణే, పోవునది॥ ౨॥ రమంతేఽత్ర రథః। రము క్రీడాయాం। దీనియందు క్రీడింతురు॥ ౩॥ ***

**ఆసౌ పుష్యరథశ్చక్రయానం నసమరాయ యత్।**

బండికన్నులు గలిగి యుద్ధార్థము గాక విహారార్థమైన రథము పుష్యరథమనంబడును ॥ పుష్యేఽత్సవాదౌ విహితో రథః పుష్యరథః। పుష్యము మంగళప్రదము గనుక తత్సామ్యమున ఉత్సవాదులు పలక్షింపఁబడును. ఆయుత్సవాదులయందు విహితమయినది పుష్యరథము ॥శ్లో॥ మహారథః పుష్యరథం రథాంగీ క్షిప్రం క్షపానాథ ఇవాధిరూఢః, అనిమా ఘుమందు నక్షత్రముతోఁ గూడ శ్లేషగాఁ జెప్పినాఁడు॥ ౧॥

**కర్ణీరథః ప్రవహణం డయనం చ సమం త్రయమ్॥౨౦౭॥**

*కర్ణీరథశబ్దము మొదలు- ౩-మనుష్యులు మోసెడు విమానము నెడు యానవిశేషము పేళ్లు॥ కర్ణేషు స్కంధేషు స్థాప్యమానో రథః కర్ణీరథః। మూపులయందు వహింపఁబడు రథము, పాలకి॥౧॥ ప్రవహతి నరశ్రేష్ఠమితి ప్రవహణం। శ్రేష్ఠమయినవానిని వహించునది॥ ౨॥ డయతే డయనం* డీఙ్ విహాయసా గతౌ। ఆకాశమందుఁ బోవునది॥ ౩॥ ఈమూఁడును సమానార్థకములు-

**క్లీబేఽనః శకటోఽస్త్రీ స్యా ద్గంత్రీ కంబలివాహ్యకమ్॥**

అనః శకట శబ్దములు బండి పేళ్లు॥ అనతి రథో నేనేత్యనః॥ స-న॥ *అన ప్రాణనే। దీని చేత రథము బ్రతుకును॥ శక్నోతి భారమితి శకటః॥ అ, పు॥ *శక్ ల్ శక్తౌ। భారమును వహించుటకు సమర్థమైనది ౨॥ **గంత్రీ కంబలివాహ్యక శబ్దములు- దిద్దిన యెద్దు దీసెడి బండి పేళ్లు॥ గచ్ఛతీతి గంత్రీ॥ ఈ- సీ॥ *గమ్ల్ సృప్ల్ గతౌ। పోవునది॥ కంబలః సాస్నా- తద్యోగాత్ కంబలినో బలీవర్దాః- తైర్వాహ్యత ఇతి కంబలివాహ్యకం। కంబళము నగాఁ గంగడోలు అది గలవి గనుక కంబళులనఁగా నెద్దులు - వాని చేత వహింపఁబడునది॥ శ్లో॥ ప్రావారే వ్యుత్తరాసంగే। సాస్నాయామపి కంబళః- అని రుద్రుఁడు

**శిబికా యాప్యయానం స్యా ద్దోలా ప్రేంఖాదికా స్త్రియాం॥౨౦౮॥**

**శిబికా యాప్యయాన శబ్దములు అందలము పేళ్లు॥ పల్లకి యును ॥ శివా మంగళప్రదా- శివైవ శిబికా- వబయోరభేదః। మంగళప్రదమైనది॥ యాప్యైరధమైర్యాయత ఇతి యాప్యయానం *యా ప్రాపణే। యాప్యులనఁగా అధములు - వారిచేత పొందింపఁబడునది ॥ **డోలా ప్రేంఖా శబ్దములు ఉయ్యాల పేళ్లు॥ దుల్యతే ఉత్క్షిప్యతే డోలా *దుల ఉత్క్షేపే। ఊఁచఁబడునది॥ ప్రేంఖతే ఇతస్తతః ప్రేంఖా* ఇఖి గతౌ। ఇట్టట్టు పోవునది॥ పుల్లింగమును గలదు॥ శ్లో॥ డోలా ప్రేంఖః పుమాన్ ప్రేంఖాని శ్రేణిరధిరోహిణీ. అని రత్నకోశము ॥ ఆదిశబ్దము చేత మంచాదులు డోలాశబ్ద వాచ్యములు

**ఉభౌ తు ద్వైపవైయాఘ్రౌ ద్వీపిచర్మావృతే రథే* పాండుకంబలసంవీతః స్యందనః పాండుకంబలీ రథే**

** ద్వైప వైయాఘ్ర శబ్దములు పులితోలు గప్పిన రథము పేళ్లు॥ ద్వీపిచర్మణావృతో రథః ద్వైపః। ద్వీపియనఁగా పులి- దానితోలు చేతఁ గప్పఁబడునది॥ వ్యాఘ్రచర్మణావృతో రథః వైయాఘ్రః। పులితోలు చేతఁ గప్పబడిన రథము వైయాఘ్రము॥ ** పాండుకంబలేన సంవీతః రథః పాండుకంబలీ॥ నాంతః ॥ తెల్లకంబళి చేతఁ గప్పఁబడిన రథము పాండుకంబళి॥

**కాంబలవాస్త్రాద్యాః కంబలాదిభిరావృతే**

కంబలేనావృతో రథః కాంబలః। కంబళి చేత గప్పబడినది॥ వస్త్రేణావృతో రథః వాస్త్రః। వస్త్రము చేతఁ గప్పఁబడిన రథము॥ ఆదిశబ్దము చేత క్షౌమాదులను గ్రహింపఁబడును॥

**త్రిషు ద్వైపాదయో రథ్యా రథకట్యా రథవ్రజే॥౨౧౦॥**

ద్వైపశబ్దము మొదలు వాస్త్రశబ్ద పర్యంతము గల శబ్దములు మూఁడు లింగములయందు వర్తించును **రథ్యా రథకట్యా శబ్దములు రథసమూహము పేళ్లు॥ రథానాం సమూహో రథ్యా, రథకట్యా చ। రథములయొక్క సమూహము రథ్య- రథకట్యయును॥

**ధూః స్త్రీ క్లీబే యానముఖం స్యాద్రథాంగమపస్కరః।**

ధూః యానముఖ శబ్దములు రథములు మొదలయిన వాహనములయొక్క ముందరిదిక్కు పేళ్లు॥ ధూర్వతి హినస్తీతి ధూః॥ ర- సీ॥ *ధుర్వీ హింసాయాం। పరులను హింసించునది ॥ యానస్య ముఖం యానముఖం। యానమనఁగా రథాదులు - వానియొక్క ముఖము॥ ...బండికన్నులు, కాఁడి- నొగ మొదలయిన రథావయవములు- అపస్కరమనంబడును॥ అపస్క్రియతే తదుచితస్థానే నిక్షిప్యత ఇతి అపస్కరః॥ పు॥ అపస్కరః *కృ విక్షేపే। ఆయా యుచితస్థానములయందు పెట్టఁబడునది।

**చక్రం రథాంగం**

****చక్ర రథాంగ శబ్దములు బండికంటి పేళ్లు॥ కరోతి రథగమనమితి చక్రం *డుకృఞ్ కరణే। రథగమనమును జేయునది ॥ రథస్యాంగం రథాంగం. రథమునకు అంగమై

**తస్యాంతే నేమిః స్త్రీ స్యాత్ప్రధిః పుమాన్ ॥౨౧౧॥**

** నేమి ప్రధి శబ్దములు బండికంటి కడకమ్మి పేళ్లు॥ నమతి శబ్దాయతే గమనసమయే నేమిః ఇ, సీ ॥ *ణము ప్రహ్వత్వే శబ్దే చ। గమనమందు మ్రోయునది। నయతి రథమితి నేమిః *ణీఞ్ ప్రాపణే ॥ రథమును పొందించునది ॥ ప్రధీయతే

